

# కొత్త సుప



మురికితో మీ నిరంతర పోరాటం ముగిసినట్లే.
న్యూ సుప డిటర్జెంట్ బార్ సబ్బు నురుగులో
తెల్లదనం బూడిదరంగు మురికిని వదిలించి
మీ బట్టలకు తెల్లదనాన్ని ప్రకాశాన్ని తిరిగి
ప్రసాదిస్తుంది. తెల్ల బట్టలు మరింత తెల్లగాను,
రంగుబట్టలు మరింత ఆకర్షణీయంగాను,
కనిపిస్తాయి. అన్ని రకాల దుస్తులకు ఇది
అత్యుత్తమం. మరే ఇతర డిటర్జెంట్ బార్ కన్న
న్యూ సుప డిటర్జెంట్ బార్ చాలా పొదుపైనది.




## మీ బట్టలకు తెల్లని
## తెలుపును కాంతిని
## తిరిగి తెస్తుంది



HARYANA DETERGENTS LTD

maa HDL 16-79 Tel

# మీ అందానికి మేలు చేకూర్చే మేకప్ మొదట మీ చర్మానికి మేలు చేకూర్చాలి.

వివిధరకాల మేకప్‌లు మిమ్మల్ని ఆకర్షణీయంగా చేస్తాయి. అవి చేసే మేలు అంతే మరి. కేవలం క్రూక్స్ వారి లాక్టో-కేలమైన్ మాత్రమే మీ చర్మానికి నిజంగా మేలు చేకూరుస్తుంది. అది మీ చర్మాన్ని మనోహరంగానూ, యవ్వనంతో ఉట్టిపడేట్లు చేస్తుంది. నిర్మలంగా తాజాగా అందంగా. ఇంత తక్కువ శ్రమతో మీ చర్మ సౌందర్యానికి మరేదీ- అంత మేలు చేయదు. అంచేతే అది పరిపూర్ణమైన మేకప్. వాడి చూడండి. మీ చర్మసౌందరం ఎంత మనోహరంగా వుంటుందో మీరే గమనించండి. అదో ఆకర్షణీయమైన అనుభూతి మరి!




3 వీలైన సైజుల్లో దొరుకుతుంది:
120 మిలీ, 60 మిలీ మరియు 30 మిలీ

క్రూక్స్ లాక్టో-కేలమైన్ ఒక రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్. ఈ మార్క్‌ను ఏ విధంగానైనా అతిక్రమించినవారు శిక్షింపబడతారు.

లాక్టో-కేలమైన్ కొనేముందు అసలైనదని రుజువు చేసుకునేందుకు క్రూక్స్ చిహ్నం కోసం, తీసి వేయబడని క్రూక్స్ సీల్ కోసం తప్పక చూడండి.

డూఫార్-ఇంటర్‌ఫ్రాన్ లి.
పోస్ట్ బాక్స్ నం. 6582, బొంబాయి 400 018

క్రూక్స్
## లాక్టో-కేలమైన్ అందంగా ఉండటానికి సరికొత్త రహస్యం

Sista's-DIL-680/Tel/79











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938 – 1972]

శుక్రవారం : 19-10-'79

సిద్ధార్థినామ సం. ఆశ్వయుజ బ. చతుర్దశి

సంపుటము 73 : సంచిక 8

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



# గొప్ప జతగా

## భారతదేశపు ఏకైక దుర్గంధనాశక సబ్బు మరియు టాల్క్

దుర్గంధంనుండి రెండురకాలుగా రక్షణకు
సరైన జోడీ... సింథాల్ సబ్బుతో
స్నానం, ఆపైన సింథాల్
టాల్క్ చల్లుకోవడం .. మీరు ఎంతో,
మరెంతో తాజాదనంతో హాయిగా
మురిసిపోయేందుకు.

**గోద్రేజ్ వారి**
**సింథాల్**







Interpub/CTS/1/79/TL



సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలాజనార్దన్

శాంతి ఇక్కడికి వచ్చినతర్వాత, తృప్తిగా హాయిగా వుంది. మనోహర్ పిల్లలతో కబుర్లు చెపుతూ వారి చదువు సంధ్యలు చూస్తుంటే సంతోషంగా వుంది.

"శాంతీ, ఈ కాలు నొప్పి, చెవిలోపోటు ...యెందుకో తల దిమ్ముగా వుంది ..." అంటూ నిమిష నిమిషం పిలిచే అత్తగారిని చూసి నవ్వుకుంది.

చాలా రోజులుగా అనారోగ్యంగా వున్న ఆమె జబ్బు మరింత ముదరకుండా చూడడం తప్ప, పూర్తిగా నయం చేయ

*(గత సంచిక తరువాయి)*

లేరని శాంతికి తెలుసు. మనోహర్ మంచి మందులే ఇస్తున్నాడు. అప్పుడప్పుడు ఆమె తృప్తికోసం మరో డాక్టరుకు కూడా చూపిస్తుంటాడు. కాని కొడుకు తనను సరిగా పట్టించుకోడం లేదనే ఆమె అభిప్రాయం.

"అదేమేమి నూరిపోసిందో! లేకపోతే నే నీపాటికి తిరిగేదాన్ని కాదూ! నా వయసు వాళ్ళందరూ ఇంకా చింత పిక్కల్లా వున్నారు" అంటూ జానకి మీద అభివాదం కూడా వేసింది.

"వయసుకూ ఆరోగ్యానికి సంబంధం లేదు. మీ అబ్బాయి ఇచ్చే మందులు చాలా మంచివి." అని నెమ్మదిగా చెప్పింది: "మీ కీ వయసులో మందులు మాకులకన్నా ఆరోగ్యాన్నిచ్చేది మనసు నిర్మలంగా వుండడం."

ఆ మాట వినగానే "యేం, నేను రాక్షసి నని అది నీకు చెప్పిందా?" గయ్‌ని లేచింది.

"నా కెవరూ చెప్పలేదు. డాక్టరుగా నేను మీకు చెప్పాల్సింది చెప్పాను."

సపర్యలన్నీ చేయించుకుంటూ కూడా కోడల్ని ద్వేషించే ఆమెను చూస్తుంటే అంతులేని కోపం వస్తున్నా, బలవంతంగా నిగ్రహించుకుంది.

ఆమె అక్కడున్నప్పుడే జానకి అత్తగారికి స్నానం చేయించేందుకు వచ్చింది.

అత్తగారిని మంచంమీది నుండి లేపి క్రింద కూర్చోబెట్టేందుకు శాంతి కూడా సహాయపడింది. పసిపాపలా అత్తగారికి సేవ చేస్తున్న జానకిని ప్రశంసగా చూసింది. 'ఇంత మంచి మనిషి నెలా తూలనాడగలుగుతున్నారు?' అత్తగారి వంక ఆశ్చర్యంగా చూసింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక పిల్లలతో పాటు వాళ్ళ గదిలోకి వెళ్ళి, ఆడుతూ పాడుతూ కూర్చుంది శాంతి. స్వర్ణ, కల్పన దూర దూరంగా వుండబోయినా వుండనివ్వ లేదు.

"మీరు నాతో మాట్లాడకపోతే నాకు యేడుపు వస్తుంది." అంటూ బుజ్జగింపుగా దగ్గరికి తీసుకుంది.

"స్వర్ణా, మీ నాన్న వచ్చారుగా. ఇంకా నామీద కోపం పోలేదా?"

"ఇక తీసుకెళ్ళవుగా."

"ఉహూఁ."

ఆనందంతో చప్పట్లు కొట్టారిద్దరూ. "మా ఆంటీ చాలా మంచిది."

కబుర్లలో కాలమే తెలియడంలేదు.

శాంతి పరుపులు దులిపివేసి స్వర్ణ కల్పనల మధ్య పడుకొని కథ చెబుతున్నది.

"ఆ రాకుమారుడు రాకుమారికై యెదురు చూస్తున్నాడు..." అంటుండగానే వచ్చింది జానకి.

"ఈ పూటకిక చాలుగాని వెళ్ళి పడుకో" అని ఆమెకు దగ్గరగా వచ్చి "మరి రాకుమారుడు రాకుమార్తె కోసం యెదురు చూడడా!" అంది నవ్వుతూ.

**జరిగినకథ 7:** తొలి డాక్టర్లు, కొడుకు విజయ్ బలవంతము చేయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తు కొస్తుంది. తన జీవితం తనవారి ఉన్నతికి పునాది కావాలని అనుకొన్న శాంతి, వాళ్ళ అవహేళనలకు గురౌతుంది. మనోహర్‌ను అపార్థం చేసుకొన్నానని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పుకోటానికి వాళ్ళ ఇంటికి వెళ్తుంది. అక్కడ మనోహర్ జానకిని హింసించటం చూచిన శాంతి అతనిని అసహ్యించుకుంటుంది. అపుడు అతడు జానకి వెనుకటి వృత్తాంతము ఆమెతో చెప్తుంటాడు. తన తల్లిదండ్రులను ఎదిరించి మేనమామ కూతురు జానకిని పెళ్ళి చేసుకొంటాడు మనోహర్. కట్నం రాలేదనీ, తన కొడుకుకి అత్త వారింట జరగవలసిన ముచ్చట్లు ఏవీ జరపలేదనీ మనోహర్ తల్లిదండ్రులు జానకిని హింసిస్తారు. భర్త మనసు అర్థం చేసుకున్న జానకి సహకారంతో శాంతి, మనోహర్‌ల వివాహం జరుగుతుంది. జానకితో కలిసి ఉండటానికే నిశ్చయించుకొని మనోహర్ ఇంటికి వచ్చేస్తుంది శాంతి.

"నాకక్కడ నుండ లేవాలని లేదు. పిల్లల కెంచక్కా కథ చెప్తూ హాయిగా ఇక్కడే పడుకుంటాను." అంది శాంతి.

"ఔను. ఆంటీ ఇక్కడే పడుకుంటుంది. ఊఁ. ఇక కథ చెప్పు ఆంటీ." తొందర పెట్ట సాగింది స్వర్ణ.

"అర్ధరాత్రౌతుంటే కథేమిటి? ఇక పడుకో." మందలించింది జానకి.

"జానకీ", వెల్లకిలా పడుకున్న శాంతి ప్రక్కకు తిరిగి "నేను ... పూర్తిగా స్వార్థపరురాలిని కాదు. ఇంతకన్నా మీకేమని చెప్పగలను?" అని గబుక్కున పిల్లల వైపు తిరిగింది.

"స్వర్ణా, ఇక చెప్తాను వినండి ..." కథ చెప్పనారంభించింది.

శాంతి ఇక అక్కడి నుండి కదలదని తెలిసిపోయింది. అంతేకాదు. ఆమె మనసు కూడా బాగా అర్థమవౌతున్నది. ఆడది అసూయకు ప్రతిరూప మనేవాళ్ళు ఈమెను చూసి యేమంటారో! వింత సృష్టి అంటారేమో!

జానకి అక్కడి నుండి మనోహర్ గదిలోకి వచ్చింది. యేదో పుస్తకం చూస్తున్న మనోహర్, ఆమెను చూడగానే పుస్తకం ప్రక్కన పెట్టాడు.

"జానకీ"

కిటికీ కర్టెన్ తొలగిస్తున్న జానకి "ఊఁ" అంది.

"శాంతి రాక నిన్ను బాధిస్తుందని తెలుసు..." అతడు బాధగా వివరించ బోతుంటే "ఏమండీ" అంటూ చురుగ్గా చూసింది.

"మీకు నేను అర్థమైవుంటే, ఈ మాట అనే వారు కాదు. శాంతి రాక నాకు బాధ కలిగించడమా? హు నాకు నేనుగా నా వాళ్ళే అర్పితం చేసుకున్న నేను ఆమె ఆగ మనానికి అయిష్టపడతానా?"

"మరి..."

"ఆమె ఇక్కడికి వచ్చి ఆమె కలుగన్న జీవితానికి దూరం కాగూడదన్న ఉద్దేశ్యంతో రావద్దని చెప్పాను. అలా చెప్పి నందుకు నాకే బాధగావుందిప్పుడు. ఆడది యెంత చదివినా, యేం చేసినా పెండ్లయిన తర్వాత అత్తింట అడుగు పెట్టాల్సిందే ఆదే మన సంఘ ధర్మం. దాన్ని పాటించని వాళను అతి హీనంగా చూస్తుంది లోకం..." యెన్నడూ లేనిది జానకి ఆవే శంగా అన్ని మాటలు మాట్లాడుతుంటే ఆశ్చర్యంగా చూస్తున్నాడు మనోహర్.

"ఇక దాన్ని గురించి ఆలోచించక హాయిగా పడుకోండి...." వెళ్ళబోతున్న జానకి చెయ్యి పట్టుకున్నాడు.

"జానకీ యెందుకు నాకీ శిక్ష?"

"శిక్ష?" విస్మయంగా చూసింది.

"ఔను నీ త్యాగశీలతతో నేనందుకున్న జీవితం సుఖంగా అనుభవిస్తున్నా, వెలితిగానే అనిపిస్తుంది. అంతులేని త్యాగాన్ని భరించలేడు మనిషి."

"మనిషి దగ్గరగా వచ్చినంత మనసుకు రాలేని మీరు... కోర్కెలకే ప్రాముఖ్యం ఇస్తారా?" అతడి కండ్లలోకి చూసింది.

దెబ్బతిన్నవాడిలా చూశాడు.

"అందం అనుభవానికే అనే దృష్టి వుంటే తప్పించుకోలేను..."





# సాహిత్య ప్రియులకు గొప్ప సదవకాశం




# ఇంటింటికీ MSCo క్రౌన్ సీరీస్ పుస్తకాలు

సుమారు 20 రూ.ల విలువ చేసే పుస్తకాలు కొనుగోలు చేస్తే 7 రూ.ల విలువ చేసే 2 ఎమెస్కో పాకెట్‌బుక్స్ ఉచితం.

## ఈ అవకాశం 30.10.79 వరకు మాత్రమే!

ఏ రకంగా వీటిని పొందవచ్చును? మొదటి జాబితాలోంచి అయితే 3 పుస్తకాలని ఎన్నుకోండి. రెండవ జాబితాలోంచి అయితే 2 చాలు. వీటి నంబర్లను కూపన్లో గుర్తించండి! అలాగే — ఉచిత పుస్తకాల జాబితాలోంచి మీకు కావలసిన 2 పుస్తకాల నంబర్లను కూడా కూపన్లో గుర్తించండి! కూపనుతో పాటు 15 రూ. M.O. చేయండి. మీరు ఎంచుకున్న పుస్తకాల విలువలో ఈ 15 రూ.లు తగ్గించి మిగతా పైకానికి వి.పి. పెట్టి పంపుతాము!

### మొదటి జాబితా

MSCo No.

- 84 పునర్జన్మ — విశ్వనాథ సత్యనారాయణ 7-00
- 102 పగిలిన నీడలు — పండూరు సుబ్బారావు 6-00
- 104 వసంతగానం — త్రివేణి-కళ్యాణి 6-00
- 143 అందుకున్న స్వర్గం — కోమలాదేవి 7-50
- 145 గోడమీద బొమ్మ — బలివాడ కాంతారావు 6-00
- 146 తొలిమలుపు — వీరాజీ 6-00
- 152 మారిన విలువలు — ద్వివేదుల విశాలాక్షి 6-00
- 158 వారధి .. 7-50
- 155 రేపటి వెలుగు .. 8-00
- 162 సెక్రటరీ — యద్దనపూడి సులోచనారాణి 7-50
- 163 విజేత .. 7-50
- 164 బందీ .. 7-50
- 166 నేనుర చయిత్రిని కాను .. 6-00
- 169 ఆశల శిఖరాలు .. 7-50
- 170 బంగారుకలలు .. 7-50
- 171 బహుమతి .. 6-00
- 172 మీనా-1 .. 7-50
- 173 మీనా-2 .. 7-50
- 175 జ్యోతి .. 6-00
- 176 సంయుక్త .. 6-00
- 177 ఆంధ్రయువకుడా! దారియిటు- .. 6-00
- 178 బిందుపథం — మాదిరెడ్డి సులోచన 6-00
- 179 పునర్జన్మ — త్రివేణి; కల్యాణి 6-00

### రెండవ జాబితా

MSCo No

- 144 దగాపడిన తమ్ముడు — బలివాడ కాంతారావు 10-00
- 148 మగువ మనసు — ధనికొండ హనుమంతరావు 10-00
- 151 వైకుంఠపాళి — ద్వివేదుల విశాలాక్షి 8-00
- 161 అభిశాపం — యద్దనపూడి సులోచనారాణి 10-00
- 165 ఉత్తరంకథ .. 12-50
- 167 జీవనతరంగాలు-1 .. 10-00
- 168 జీవనతరంగాలు-2 .. 10-00
- 174 ఆహుతి .. 10-00

అయ్యా — నాకు కావలసిన పుస్తకాల నంబర్లు:

[ ] [ ] [ ]

ఉచిత పుస్తకాల నంబర్లు:

[ ] [ ]

చిరునామా:

### ఉచిత పుస్తకాలు

EPB No.

- 99 ఆత్మీయులు — యద్దనపూడి సులోచనారాణి
- 126 అసమర్థుడి జీవయాత్ర — గోపీచంద్
- 129 రామచంద్ర విజయము — చిలకమర్తి లక్ష్మీనరసింహం
- 360 సిరిసిరిమువ్వ — జొన్నలగడ్డ లలితాదేవి
- 366 మాధవి — కొలిపాక రమామణి
- 362 మిసెస్ చైతన్య — వేదుల శకుంతల
- 365 కర్మభూమి — వసుంధర
- 366 సత్యం శివం సుందరం — డి.వి.ఎస్. ఆర్. మూర్తి
- 367 లవ్ మీ — శీలంశెట్టి రమాదేవి
- 368 ఇలా ఎంతమందో — దేవరాజు సీత
- 369 ఒకే సూర్యుడు — ఇల్లాదేవి
- 370 పగడాల పంజరం — ఆర్. సంధ్యాదేవి

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**
రాష్ట్రపతిరోడ్
సికింద్రాబాద్-500 003

ఆమె మాటలు చురకలు తగిలించి పెట్టున్నాయతడికి.

"నేను కోరుకున్నది ఈ ఐహిక సుఖమే కాదు; నాకు మాత్రమే పరిమితమయ్యే హృదయం కూడా"

"జానకీ, నీ మీద నాకు..."

"తెలుసు. అయిష్టం లేదు. అసహ్యం లేదు. కోపం లేదు. కావల్సినంత కరుణ వుంది. కాని...మీ భార్యగా నేను కోరుకున్న దదికాదు. మీ గుండెల్లో నేనే నిండి పోవాలని."

అప్రయత్నంగానే అతడి చెయ్యి ఆమె వొదిలేసింది.

"ఏమండీ" అతడికి మరింత దగ్గరగా వచ్చింది. "మీ భార్యగా నా మీద సర్వాధికారం వుంది. మీరు కావాలనుకుంటే..."

"జానకీ" అరిచినట్టుగా అన్నాడు. "నేను కామాంధుణ్ణనుకుంటున్నావా?"

జానకి మెల్లగా నవ్వింది.

"నన్నర్థం చేసుకోలేదా జానకీ" ఈ సారి అతడి కంఠం వ్యధగా పలికింది.

"యెందుకర్థం చేసుకోలేను? ఇప్పుడు మీ రెందుకు బాధపడతున్నారో నాకు తెలుసు. మీలో నాపై అభిమానం, కరుణే కాకుండా క్రొత్తగా కృతజ్ఞత కూడా బైలుదేరింది. నేను మీ వల్ల యేదో నష్టపోయానన్న భావన మిమ్మల్ని బాధ పెడుతున్నది...

మీ అనురాగం శాంతికే దక్కింది. ఆమె సన్నిధి మీ కానందం కలిగిస్తుంది. నా వల్ల మీరు పొందేది తృప్తి."

"జానకీ..." ఆమె ఇప్పుడు తన భార్యగా, తన పిల్లల తల్లిగా అనిపించడం లేదు. యే శక్తో ఈ రూపంలో వుందనిపిస్తున్నది. వెడల్పాటి జరీ అంచున్న తెల్ల చీరలో, నుదుట గుండ్రంగా దిద్దిన వెడల్పాటి తిలకంతో, గంభీరంగా వుంది.

అంత చేరువలో వున్నా ఆమె అందుకోలేని చందమామలా, ముట్టుకోలేని అగ్నిలా, శపించే మహా మునిలా అనిపిస్తుంటే; అలాగే నిల్చుండి పోయాడు.

కొద్దిసేపటి తర్వాత జానకి అక్కడి నుండి వెళ్ళబోతుంటే "నన్ను నమ్మలేక పారిపోతున్నావా?" నిర్లిప్తంగా నవ్వుతూ అన్నాడు.

"కాదు, కేవలం శారీరక సుఖాన్నే వాంఛించే పరిస్థితి రాకూడదని." తిరుక్కున తిరిగిన ఆమె కళ్ళలో నీళ్ళు తిరగడం అతను చూడకపోయినా, ఆ గొంతులో ఆవేదన అతణ్ని బాధ పెట్టింది.

"మీరు మగాళ్ళకే ముద్దొచ్చేట్టున్నారు"

"ఎంత అల్లకల్లోలమైన మనస్సైనా మీ నవ్వు చూడగానే ప్రశాంతంగా వుంటుంది..."

"అబ్బ! మీలో యేం శక్తి వుందో! పదే పదే మిమ్మల్ని చూడాలనిపిస్తుంది. ఎందరి కన్నియల గుండెలలో నిలిచిందో మీరూపు."

ఆమె మాట లొక్కొక్కటే గుర్తొస్తుంటే అతడి గుండె కెలికినట్టవుతున్నది.

"కేవలం శారీరక సుఖాన్ని వాంఛించే పరిస్థితి రాకూడదని..." జానకి వెళుతూ అన్న ఆ మాటలు అతణ్ని కూర్చోనివ్వడం లేదు.

'జానకి బలవంతంగా కోర్కెలను అణచుకుంటున్నది. తనెంత దుర్మార్గుడు!' తనను తనే తిట్టుకున్నాడు.

పెరట్లో తులసికోట దగ్గర మంచం వేసుకొని పడుకున్న జానకిని ఆ జ్ఞాపకాలు బాధ పెడతున్నాయి.

'యెందరి గుండెల్లో మీరు నిలిచినా మీ గుండెలో నేనున్నానని పొంగిపోయిన రోజులవి. నాకా అదృష్టం లేదు.' దుఃఖం పెల్లుబికింది.

* * *

ఓ రాత్రివేళ స్వర్ణ బాత్‌రూంకెళ్ళాలని లేపితే లేచి పెరటివైపొచ్చిన శాంతి తులసికోట దగ్గర జానకిని చూసి నిర్ఘాంతపోయింది.

"జానకీ..." మంచం దగ్గరికి వచ్చి వంగి ఆమెను తట్టి లేపింది.

స్వర్ణ "నేను పడుకుంటా"నని అప్పుడే లోనికి వెళ్ళింది.

అప్పుడే నిద్ర పట్టిందేమో జానకి మత్తుగా "హఁ." అని మళ్ళీ ప్రక్కకు తిరిగి పడుకుంది.

"జానకీ" ఈ సారి భుజం పట్టి వూపడంతో గబుక్కున లేచి కూర్చుంది.

"శాంతీ, నువ్వా?"

"మంచుపడుతున్నది. లేచి ఇంట్లో పడుకోండి." యేదో ఆలోచిస్తూ అంది.

"పిల్లలు లేపారా?"

"ఊఁ. స్వర్ణ లేపింది." అని "రండి లోపలికెళ్దాం." అంటూ ఆమె చెయ్యి పట్టుకుంది.

అక్కడే పడుకుంటానని చెప్పాలనుకున్న జానకిని శాంతి ప్రవర్తన నోరెత్తనివ్వ లేదు.

మౌనంగా ఆమెతోపాటు పిల్లల గదిలోకి వచ్చి స్వర్ణ ప్రక్కన పడుకుంది. విజయ్ మంచం రోజులాగా ఆ మంచానికి దగ్గరగా లేకుండా గోడ దగ్గర కుండడం చూసింది

కల్పన ప్రక్కన పడుకున్న శాంతికి యెన్నెన్నో ఆలోచనలు! మరెన్నో సం



హోలు ! యెంత ప్రయత్నించినా నిద్రపట్టడం లేదు.

'జానకి యెందు కక్కడ పడుకుంది ? మనోహర్ యేమన్నా అన్నాడేమో!' అస్థిమితంగా వున్న శాంతి లేచి గది వెలుపలికివచ్చి, మనోహర్ గది వైపు నడిచి. వారగా వేసివున్న తలుపులు తోసి లోపలికి వెళ్ళిన ఆమె ఆశ్చర్యచకితురాలయింది.

రోజు కొకటో రెండో తప్ప, యెక్కువ సిగరెట్లు కాల్చని మనోహర్ ఇప్పుడు అవిరామంగా కాలుస్తున్నట్లు ఆ గది నిండా పడివున్న సిగరెట్ పీకలు, అతడు వాలు కుర్చీలో పడుకొని సిగరెట్ కాలుస్తుండడం చూస్తూనే తెలుస్తుంది.

'మీరింకా నిద్రపోలేదా ?'' అతడికి దగ్గరగా వచ్చింది శాంతి.

మనోహర్ పలకలేదు. ఆ సిగరెట్ తాగడమే అతడి ధ్యేయంలా వుంది.

గబుక్కున అతడి చేతిలో సిగరెట్ తీసి గోడకురాసి దూరంగా పారేసింది.

''ఇప్పుడు నీ కొచ్చిన లాభమేమిటి ?''

బిత్తరపోయింది శాంతి. ''యేమిటి మీరనేది ?''

అతడి చూపు లెటోవున్నాయి. ''సిగరెట్ నెందుకలా పారేశావు ?''

''మనూ'' భయంగా చూసింది. ''మీరలా మాట్లాడకండి.''

''భయపడుతున్నావా ?'' వికటంగా నవ్వాడు. ఆ నవ్వు బాధలో నుంచి వచ్చినదని అతడి ముఖంలో, గొంతులో, భావాలే చెప్తున్నాయి.

''భేష్. బాగుంది.. ఒక భార్యకు తనను నా హృదయంలో పరిపూర్ణ స్థానం లేదని బాధ, మరో భార్యకు నా మాటలే భయం...''

''మనూ'' గబుక్కున అతడి నోరు మూసింది.

అతడి మాటలు ఆమె సందేహాన్ని నివృత్తి చేశాయి. జానకి అనురాగమూర్తే కాదు, అభిమానవతి కూడా. దానితో ఆమె అతడికి దూరం కాగా, తన కతడు చేరువయ్యాడు. ఈ సంఘర్షణ నతడు తట్టుకోలేడని ఇప్పుడతడి చర్యలవల్ల తెలుసుకుంది.

''మనూ, మీరంటే మీ మాటలంటే భయం కాదు ఇష్టం. అందుకే ఈ తాపత్రయం.'' యేడుస్తూ అతడి ముందు కూలబడింది.

## ప్రేమ పాశం

''శాంతి...'' అప్పుడే యేదో ప్రపంచం నుండి వచ్చిన వాడిలా చూశాడు. ''ఏమిటి, యేమిటది ?''

''మీ వూహల పరిణామం.'' ఏడుస్తూనే అంది. ''మిమ్మల్ని ప్రేమించిన జానకికి, నాకు మీరు ఇస్తున్న ఆవేదన.''

### నీలికనుల బొమ్మలు

1927వ సంవత్సరంలో అమెరికా ప్రజలు సుహృద్భావ సూచకంగా జపాను పాఠశాలలకు 13 వేల నీలి కనుపాపల బొమ్మలను బహూకరించారు. ఈ అందమైన బొమ్మలు చిన్న చిన్న తరగతుల విద్యార్థులకు చూడముచ్చటగా వుండేవి. అయితే ఆ తరువాత అమెరికా, జపాను దేశాల మధ్య ఏర్పడిన వైరుధ్యం వలన యీ బొమ్మలలో చాలా వాటిని నాశనం చేశారు. పోగా, యిప్పుడు 72 బొమ్మలు మాత్రమే మిగిలి వున్నాయి. అయితే అందులో తొమ్మిది అందమైన బొమ్మలను అమెరికాకు, యీ మధ్య తీసుకొని వెళ్ళారు. యీ రెండు దేశాల మధ్య మరల ఏర్పడుతున్న సుహృద్భావానికి నిదర్శనగా, న్యూయార్కులో జరుగుచున్న పిల్లల బొమ్మల ప్రదర్శనలో పాల్గొంటాయి. ప్రదర్శన ముగిసిన తరువాత యీ బొమ్మలను తిరిగి జపానుకు తీసుకుని వస్తారు.

''శాంతి, నీకెలా చెప్పను ? నేను బాధ భరించలేను. జానకి...''

''మీరు చెప్పకుండానే తెలుసుకున్నాను. జానకి దుర్మార్గురాలు కాదు. దుష్టురాలు కాదు. మీరంటే అయిష్టం అంతకన్నా లేదు. ఆమె అభిమానవతి.

వివాదం పరిష్కార మార్గం కాదు. వివేకంతో జీవితాన్ని మలచుకోవాలి...''

నిస్పృహ చెంది జీవితమంటేనే అసహ్యం పుట్టిన మనోహర్‌కు ధైర్యం చెప్పింది. ఆశలు రేపింది.

తాత్కాలికంగా బాధలో మరుగునపడ్డ వ్యక్తిత్వం మేల్కొనగానే పూర్వపు వుత్సాహం వచ్చింది మనోహర్‌కు.

* * *

ఆ రోజు సాయంత్రం హాస్పిటల్లో శాంతికి పని వుండడంవల్ల మనోహర్‌తో పాటు ఇంటికి రాలేదు.

రెండు గంటలు ఆలస్యంగా ఇంటికి వచ్చిన శాంతి వెంట నలభై ఏళ్ళపైబడ్డ మనిషి కూడా వుంది. ఆమెకి ఇంటికిరాగనే లోపలికి తీసుకెళ్ళి ఇల్లంతా చూపించింది.

''చూశారా కామాక్షమ్మగారూ, ఇప్పుడీ ఇల్లెలా వుందో ఇక మీదట కూడా అలాగే వుండాలి. ఇంత వరకు మేమెంత రుచికరంగా తింటున్నామో అలాగే తినాలి. తెలిసిందా ?''

''పని చేసి చూపించాలి గాని మాటలతో సరేనంటే యెలాగమ్మా ?'' అంది కామాక్షమ్మ.

''ఏమిటి ఆమెకన్నీ వివరిస్తున్నావు ?'' వంటింటి ముందు నిల్చున్న వారి దగ్గరకు వచ్చింది జానకి.

''ఇకనైనా మీరు విశ్రాంతిగా ఉండండి. ఇకనుండి కామాక్షమ్మగారు వంట పని చేస్తారు.'' అంది శాంతి.

''నేనిప్పుడు దస్సిపడి పోతున్నదేమీ లేదు. ఈ పనికి వేరే మనిషెందుకు ?''

''అయ్యో, ఇందరున్న ఇల్లు. అందులో ఇద్దరు ఉద్యోగస్థులున్న ఇంట్లో వంటమనిషి లేకపోతే యెలాగమ్మా ?'' తప్పకుండా వుండాల్సిందే నన్నట్లు మాట్లాడింది కామాక్షమ్మ.

లలిత, సుమిత్రలకు శాంతి పద్ధతి బొత్తిగా నచ్చలేదు. శాంతి వచ్చిన రోజు పిల్లల దగ్గర పడుకోవడం, జానకి మనోహర్ గదిలోకి వెళ్ళడం వరకే చూసిన వాళ్ళు వ్రుదికి... ఈ రోజు వంటమనిషిని తేవడం కూడా వాళ్ళకు ఇష్టం లేదు.

''మన పని మనకు బరువౌతుందా ? అనవసరమైన ఖర్చెందుకు ?'' కాస్త కటువుగానే అంది లలిత.

''అందరూ చెయ్యి కలిపినప్పుడు అనవసరమే. కాని అలా జరగడంలేదుగా.'' ఇక యెక్కువగా మాట్లాడడం అనవసరమన్నట్లు అక్కడి నుండి వెళ్ళిపోయింది శాంతి.

ఆ రాత్రి అందరికీ కామాక్షమ్మ వడ్డిం

చింది. శాంతి రాక జానకిని మరింత క్షోభ పెడుతుందేమో ననుకున్న శివయ్యకి ఏ విషయం చాలా సంతోష పెట్టింది.

తులశమ్మకు కూడా కామాక్షమ్మే అన్నం తీసుకెళ్ళింది.

"కలికాలం! అత్తకు పనివాళ్ళతో అన్నం పెట్టిస్తున్నారు." తులశమ్మ హోరున యేడుస్తుంటే, జానకి బెంబేలు పడి గబ గబ అక్కడికి వెళ్ళబోతుంటే "జానకి" అంటూ శాంతి పిలిచింది.

"వుండు. అత్తయ్యకు అన్నం పెట్టి వస్తాను."

"కామాక్షమ్మగారు పెడుతున్నారు." ఆమె చెయ్యి పట్టుకున్నది.

"శాంతీ అత్తయ్య..."

"మీతో నేను మాట్లాడాలి. అలా వెళ్దాం రండి." ఆమె వొదిలితే వెళ్ళిపోతుందేమోనని చెయ్యి పట్టుకొనే హాల్లో ముందున్న మెడిసన్స్ గదిలోకి తీసుకెళ్ళి తలుపులు మూసి గడియ పెట్టింది.

"యెందుకిలా తెచ్చావు?" శాంతి ప్రవర్తన ఆమెనయోమంగా వరుస్తున్నది.

"మీకు మందులిచ్చేందుకు." నవ్వింది. ఇంటిదగ్గరకొచ్చే పేషెంట్సును అక్కడే పరీక్ష చేస్తారు.

"నాకే రోగం లేదు."

"వుండవలసిన దానికంటే ఏది ఎక్కువైనా, తక్కువైనా మనిషికి మంచిది కాదు."

"ఇప్పుడు నాకేమయింది?"

# ప్రేమ పాశం

"మంచితనం, మితిమీరి మీరు కించపరుచుకోడం." వుద్రేకంగా అంది.

"అయితే ఇప్పుడు వీటన్నిటికీ మందు లిస్తావా?" నవ్వుతూ అంది.

"జానకీ, మీరిలా పండడం నేను సహించలేను. రోగానికి మందు తీసుకున్నట్లే శాంతి ప్రదమైన జీవితానికి ప్రయత్నం చెయ్యాలి."

"ఇప్పుడు నా జీవితానికేం?"

"ఔను. చాలా అద్భుతంగా వుంది. నిద్ర లేచింది మొదలు సాధింపులు, వెదిరింపులు. యేమాత్రం మమతాభిమానాలు, గౌరవ మర్యాదలు లేని వాళ్ళకు సేవలు చేస్తుండడం! ఆహా, యెంత సుఖవంతమైన జీవితం!" అని క్షణ మాగి "మీ అశాంతి జీవితంలోకి కోరినిలా నేనూ ప్రవేశించి మీకు దక్కిన తృప్తిని కూడా మిగల్చకుండా చేశాను." అంది విచారంగా.

"జీవితం మన నిర్ణయ ప్రకారం జరగదుగా."

"జానకీ, ఈ వేదాంత ధోరణితో జీవితం నరకం చేసుకోకండి. మనం సరైన స్థానంలో లేకపోతే, లోకం తేలిక భావంతో చూస్తుంది. మీరు మనోహర్‌కు దూరంగా వున్నారని తెలిస్తే ఇంట్లో వాళ్ళు మరింత చులకనగా చూస్తారు. చుట్టుప్రక్కల వాళ్ళకు మన కథ కాలక్షేప మౌతుంది. మనం బాధ పడుతూ వాళ్ళకా అవకాశాన్నెందుకివ్వాలి?"

"శాంతీ, మనసు నెదిరించే శక్తి లేదు నాకు. ఈ విషయం ఆయనతో కూడా చెప్పు." సాలోచనగా అంది.

"జానకి..." షాక్ తిన్నదానిలా చూసింది. "మీ అంతరంగిక విషయాలు తెలుసుకోవాలని లేదు. మనోహర్ నాతో యేంచెప్పలేదు. తెలుసుకోవాలనుకొనే సంస్కార వంతురాలిని కాదు. ఆ రోజు మీరు..." ఆమె గొంతులో కలవరపాటుకు నవ్వింది జానకి.

"శాంతీ, నీవు గొప్ప సంస్కారం గల దానివని నాకు తెలుసు. నేనే ... నేను పూర్తిగా స్వార్థపరురాలినేమో ననిపిస్తుంది..."

"మీది స్వార్థం కాదు. అభిమానం" అని "జానకీ, మీరు మీ మనసు కుదుటపడేవరకు యెలావున్నా, బైటికి మాత్రం మీ మధ్య దూరం తెలియకూడదు." ప్రాధేయపూర్వకంగా చూసింది.

"శాంతీ..." దిగ్భ్రాంతిగా చూసింది.

"నీలా నేనెందుకుండలేక పోతున్నాను? నా కోసం, నా గౌరవ మర్యాదల కోసం యెంత ఆరాట పడుతున్నావు?"

"మీ సొమ్మననుభవిస్తున్న నేను, మీ బాధ చూడలేను."

"కాదు శాంతీ, అమ్మ, నాన్న, అన్న, చెల్లి, తమ్ముడు యెవ్వరూ లేని నాకు నిన్ని విధంగా దేవుడు పంపించాడు..." ఆత్మీయతగా ఆమె కళ్ళలోకి చూచింది.

"రోగం చెప్పి మందు తీసుకోమన్న డాక్టరువి. నీ మాట కాదనలేను. కాని... శాంతి, మనసు చంపుకోలేను. అభిమానం వీడలేను."

"కాలం మనసును మారుస్తుంది. నా మాట కాదన్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది..."

మనోహర్ క్లినిక్ నుండి వచ్చేటప్పటికి జానకి, శాంతి గదిలోనే వున్నారు.

తులశమ్మ కొడుకుని పిలిచి వంటమనిషి విషయం చెప్పింది. తనకూ ఆ వంట మనిషి చేతే అన్నం పెట్టించారని చెప్పి కన్నీళ్ళు పెట్టుకుంది. "పెండ్లి కెదిగిన పిల్లలు, నిరుద్యోగులైన తమ్ముళ్ళు, ఇంత సంసారంలో ఇదెంత అనవసరమైన ఖర్చు." అంది.



అమ్మా, మనబీరువాలలో కూడా
ఓడోనిల్ ఎందుకు
పెడుతున్నాం?

ఎందుకంటే
ఓడోనిల్ పురుగుల్ని, బొద్దింకల్ని,
తరిమివేస్తుంది, పురుగులు కొట్టెయ్యకుండా
బట్టల్ని తాజాగా, సువాసన
చిందేలా చేస్తుంది.










- కలరా ఉండలకన్న 30 రెట్లు శక్తివంతమైనది.
- ఇళ్ళల్లో, ముఖ్యంగా మరుగుదొడ్లలో గాలిని తాజాగా, దుర్వాసన లేకుండా చేస్తుంది.

CHAITRA-BLS-186 TEL

## అమెరికా ప్రెసిడెంటుపదవికి ఎడ్వర్డ్ కెనెడీ పోటీ

సెనేటర్ ఎడ్వర్డ్ కెనెడీ, వచ్చే సంవత్సరం జరుగనున్న అమెరికన్ ప్రెసిడెన్షియల్ ఎన్నికలలో పోటీ చేయటానికి డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థిత్వానికి ప్రయత్నించనున్నట్లు చేసిన సూచన అమెరికన్ రాజకీయ రంగంలో సంచలనం కలిగించింది. ఇప్పటికే కొందరు తమ అభ్యర్థిత్వాలను ప్రకటించారు. మరికొందరు బహిరంగంగా ప్రకటించి నప్పటికీ, పోటీకి సన్నాహాలు చేసుకొంటున్నారు.

ప్రెసిడెంట్ కార్టర్ తన అభ్యర్థిత్వాన్ని ఇంకా ప్రకటించలేదు. అయితే, పోటీకి తయారౌతున్నమాట మాత్రం నిజం. నేడు అమెరికాకు బలమైన రాజకీయ నాయకత్వం కావాలని కొందరు అంటున్నారు. అట్టి నాయకత్వాన్ని సమకూర్చగలిగిన సమర్థులు సెనేటర్ ఎడ్వర్డ్ కెనెడీ అని పలువురి అభిప్రాయం. సెనేటర్ కెనెడీ గనుక నిజంగానే ఎన్నికల రంగంలోదిగితే 1980వ సంవత్సరపు ఎన్నికల వాతావరణం చాలా సందడిగా ఉండవచ్చునని చెప్పాలి.

# ప్రేమపాశం

"నాకా విషయమే తెలియదే!" ఆశ్చర్యపోయాడు.

"నీ కెలా తెలుస్తుందిరా నాయనా! అదేం మత్తుమందు చల్లిందో, నవిత్తైనా దానిచుట్టూ తిరుగుతుంది శాంతి. అది చెప్పి వుంటుంది..." జానకి గురించి ఆమె అలా మాట్లాడడం అతడు భరించలేక పోయాడు.

"ఒకవేళ జానకి చెప్పింది నిజమే అయితే చాలా అవసరమై వుంటుంది. అందులో ఆమెకీ మధ్య ఆరోగ్యం కూడా బాగుండడం లేదుగదా!" అంటూ అతడు బైటికి వస్తుండగా జానకి, శాంతి నవ్వుకుంటూ హాల్లోకి వచ్చారు.

"యేమిటీ రోజు డాక్టరమ్మగారు ఘనకార్యం చేశారట?" అన్నాడు మనోహర్.

"ఘనకార్యం గురించి తీరుబడిగా మాట్లాడవచ్చు. నాకాకలిగా వుంది. భోజనానికి సిద్ధమవ్వండి ముందు." అంది శాంతి.

వంటమనిషి గురించే అతడలా అన్నాడని తెలుసు. ఆ విషయం పెద్దగా అందరిలో చర్చించడం ఇష్టం లేకే ప్రసంగం మార్చింది. మనోహర్ తమ్ముళ్లు, చెల్లెళ్లు తన వైపు కొరకొర చూడడం గమనించి లోలోపలే నవ్వుకుంది.

మనోహర్ కోసమే అంతవరకు భోజనం చెయ్యకుండా వేచివున్నారు జానకి, శాంతి. ముగ్గురికి వడ్డించింది కామాక్షమ్మ.

శాంతి గలగల యేదో మాట్లాడుతునే వుంది.

"జానకీ, నీవు శాంతిని మరీ చిన్నపిల్లలా చూస్తూ ముద్దు చేస్తున్నావు. అందుకే బాగా అల్లరి చేస్తున్నది." నవ్వుతూ అన్నాడు మనోహర్.

శాంతి నిజంగానే ఆ పూట చాలా సంతోషంగా వుండి చిన్నపిల్లలా మాట్లాడేస్తున్నది.

"ముద్దు వల్ల కాదు. నిర్మలమైన మనస్సుంటే అలాగే హాయిగా నవ్వగలుగుతారు." శాంతి వైపు ప్రేమగా చూసింది జానకి.

"హతోస్మి! ఇద్దరు ఒకటయ్యారన్నమాట."

"అది మీకు దిగులు లేకుండా చేస్తుందిగా." అల్లరిగా అంది శాంతి.

వాళ్లలా మాట్లాడుకుంటూ భోజనం చేస్తుంటే కనుల పండువుగా చూస్తున్నది కామాక్షమ్మ.

"కూర వెయ్యనావమ్మా?" అంటూ కూర గిన్నె పట్టుకొచ్చిన ఆమెతో "మాకు వడ్డించాలంటే అధమం ఇంకో గంటైనా నిల్చోవల్సి వస్తుంది మీరు. మా శాంతి మామూలుగానే తొందరగా భోంచేస్తుంది. ఇక మాటలు మొదలు పెట్టిందంటే మేమూ అంతే తొందరగా లేచేట్లు చేస్తుంది. అందుకని ఆ గిన్నె లిటు పెట్టి మీరు వెళ్ళండి." అంది జానకి.

"మాశారా, నేను ఆలస్యంగా తింటానని యెలా వెక్కిరిస్తున్నారో!" బుంగమూతి పెట్టింది శాంతి.

"మాట్లాడుకుంటూ తింటేనే తృప్తిగా వుంటుంది. తిండి కడుపు నింపుతుంది. మాటలు మనసును వుత్సాహపరుస్తాయి. పరవాలేదు యెంతసేపైనా నేను వడ్డిస్తాను. మీరు తినండమ్మా." అంది కామాక్షమ్మ.

"శాంతీ, అయితే నీకు కామాక్షమ్మగారి సపోర్టువుందన్నమాట."అన్నాడు మనోహర్.

ఆ నవ్వుల కేరింతల వాతావరణం వాళ్ళతోపాటు శివయ్యను ఆనందపరుస్తూ, తులశమ్మ ఆమె పిల్లల్ని మాత్రం మహా బాధగా గురిచేస్తున్నది.

"మనకు ముందుగా ఇంత పడేసి వాళ్ళలా హాయిగా కబుర్లు చెప్పుకుంటూ తింటున్నారో చూడు." ఒక్కొక్కళ్ళు వుడికి పోతున్నారుగాని తామే ఆ కళ్ళని ఏనిమిదిన్నరకు అన్నాల ముందుకొచ్చారని, ఇప్పుడు పది గంటలు దాటిందని యెవరూ అనుకోలేదు.

"నాబాయ్, ఈ ప్రశ్నకు జవాబు తెలియడంలేదు." అంటూ ఇంగ్లీషు పుస్తకం పట్టుకొచ్చిన విజయ్‌ను "నా కింతకంటే పనిలేదు. వుద్యోగంలేదని యెంత చిన్నచూపు చూస్తున్నారు? మీ నాన్న ముచ్చట్లతో కాలక్షేపం చేస్తుంటే మేము మిమ్మల్ని వుద్ధరించాలా?" కసురుతున్న మూర్తి మాటలు వంటింటి నుండి వెలుపలికి వస్తున్న శాంతి చెవిని పడనే పడ్డాయి. యేదో మాట్లాడుతూ నవ్వుకుంటున్న జానకి, మనోహర్‌ల కామాటలు వినిపించలేదు

"శాంతీ, యేమిటి అక్కడే ఆగిపోయావు?" చక్కపొడి వెస్కేందుకు స్టోర్‌రూమ్ లోకి వెళ్ళుతున్న జానకి వెనక్కి చూసింది.

"యేంలేదు. అక్కడేదో పురుగులా వుంటే చూశాను. అది పేడ పురుగు. కాలితో నలిపేశాను." అంటూ హాల్లోకి వచ్చింది.

(ఇంకా వుంది)

# రేపే మీరు లేకుంటే!

**మీ ప్రశాంత, సురక్షిత పదవీ విరమణ జీవితం... ప్రతినెల తరిగినంత ఆదాయం... జీవిత కాలమంతా... మేము మీకు హామీ యిస్తాం.**



మీకు 50 యేండ్లు రాగానే మీ పదవీ విరమణగూర్చి ఆలోచిస్తుంటారు. మీ బరువు బాధ్యతలంతా మీరు పూర్తి చేసినట్లు సంతోషిస్తారు. మీ కుటుంబం విషయమై నిజంగా మీరు ముందుగానే ఆలోచించి, తగిన చర్య తీసికొని వుండియున్నచో, మీ కుమారుడు లేక మీ కుమార్తె సుఖంగా తమ జీవితంలో స్థిరపడియున్నారని చాలా సంతోషిస్తారు.

మీకు ప్రావిడెంటు ఫండు, గ్రాట్యుయిటీ, జీవిత భీమా ద్వారా యెంతెంత మొత్తాలు రావాలో లెఖలు కట్టడం మొదలు పెడతారు. ప్రతినెలా మీకు రాబడి వుండేట్లుగా యీ మొత్తాలను పెట్టుబడి పెట్టే సరియైన పద్ధతి యేదా అని ఆలోచిస్తుంటారు.

అప్పైన మీముందు ఒక గండి కనబడుతుంది. ....మీ జీవిత ప్రమాణాలను యెప్పటివలెనే జరుపుకోవాలంటే, యీ గండిని మీరు పూడ్చాల్సి వుంటుంది. అయితే మీరు దీనిని సులభంగా సరిచేసికోవచ్చు. ప్రతినెలా మీ జీవితకాలమంతా మీరు ఆదాయం పొందే విధానాన్ని సిండికేట్ బ్యాంకు చూపిస్తుంది.

ఇందుకై మీ సమీపమందలి సిండికేట్ బ్యాంక్ బ్రాంచియందు స్వయంగా వెళ్ళి తెలిసికోండి. మేము మీకోసమే కాచుకొని యున్నాం. డబ్బుకు సంబంధించిన మీ సమస్యల విషయమై యిప్పుడైనా లేక సమీప కాలమందైనా లేక రాబోవు కాలమందైనా మేము తగిన జాగ్రత్త తీసికొంటామనే ధైర్యంతో వుండండి.

మా ప్రత్యేక పథకాలు

**క్యుములేటివ్ వార్షిక డిపాజిట్**

నెలకు రు. 100 వంతున పది యేండ్లకాలం చెల్లించండి. జీవితాంతం మీకు ప్రతినెలా రు. 144-55 వస్తుంది. ఇంతేకాకుండా మీ అసలు, వడ్డీతో చేరి (రు. 19,423/-) అలాగే పదిలంగా వుంటుంది.

**ప్రగతి రొఖం సర్టిఫికేట్**

తోచినంత స్వల్ప మొత్తాన్ని విల్లరగా పెట్టుబడి పెట్టి, అది ఫలితానికి రాగానే పెద్ద మొత్తాన్ని నిండుగా పొందండి.



**సిండికేట్ బ్యాంక్**

ఇచ్చట వయసు మళ్ళిన మీ జీవితాన్ని మేము జాగ్రత్తగా కాపాడుతాం.

maa SB 103 TEL




హరిపురం సెంటరుకు కొంచెం దూరంగా సోంపేట రోడ్డుమీది ఆడివి పక్కన ఉన్న చిన్న హోటల్లో కాఫీ తాగుతున్న ఇద్దరు వ్యక్తుల మధ్య సంభాషణ ఈ విధంగా సాగుతోంది :

"అయితే, పంతులు గోరూ, నాను నరుపంచి నయిపోతవన్న మాట !"

"అన్న మాటేమిటి, ఉవ్మమాటే? నువ్వు చూపించిన జాతకచక్రం నిజమైన దైతే నా మాటకు తిరుగులేదు. ఎటొచ్చీ, పది లేక ఇరవై రోజులు అటూ ఇటూగా జరగొచ్చు అంతే !"

"మరయితే, డబ్బొచ్చాదని సెప్పుతన్నరు. అది కూడా..."

"ఆహా మాటికి మారుపోళ్ళు అది జరిగి తీరవలసిందే. బహుశా, ఏ పెద నాయుడుగారో నీకు ఏ పార్టీ తరఫున డబ్బు తెచ్చి ఇవ్వవచ్చు పెద మొత్తమే వస్తుందిలె అదొచ్చినప్పుడు మాత్రం నన్ను మర్చిపోకు సుమా !"

"అచ్చీ, ఎంత మాట ! ఈ యేలతో అయిపోతదేటి ! తవరు శ్రీకాకుళం పేటలో జోతిష్యం సెప్పేవోరు. లావు గొప్పోరు. స్నేహ సమితి పెసిడెంటు నవ్వాల, పరిషత్తు మెంబర్నవ్వాల. ఏవ్వారం ఏమ్మెల్యే నవ్వాల అంతదాకుంది. మీరు మంచీ సెడూ సెప్పుతావుండకపోతే నానెట్టా గవుతను? నానెమ్మెల్యేనయితే మీ అప్పొయొర్ని నాకిందే సేసుకుంతను. నాను మిమ్మల్ని మర్చిపోటవే... సరయితే నానెల్తను బాబు..."

ఆ మనిషి వెళ్ళిపోయాడు. పంతులు మిగిలాడు.

ఇందాకట్నుంచీ వీళ్ళ సంభాషణను వింటూ దూరంగా కూర్చొనున్న ఇద్దరు ముతక చొక్కా - పంచె వ్యక్తుల్లో ఒకడు నెమ్మదిగా లేచి వచ్చి పంతులు పక్కన బెంచీమీద కూర్చుని అన్నాడు.

"బాబు, నా క్కూడ మంచీ సెడూ సెప్పుతరేటి ?"

"ఎవరు నువ్వు ?"

"నానాండి. నాను దరమరాజునండి. మాది కాశీబుగ్గండి జీడిపిక్కల పాక్టరీల బోకర్ని"

పంతులు మొహం కొంచెం చిరాకు పులుముకుంది. "ఆ నాయుడు నాకుతెలిసిన వాడు కనకా, ఆయన జాతకం నాదగ్గరుంది కనకా ఇందాకట్నించీ చర్చించుకున్నాం. నువ్విప్పుడు హఠాత్తుగా నన్ను ముంచోబెట్టి అడిగితే నేనేం చెప్పేది ? రాశి చక్రం, అంశా గ్రహా ఏమీ లేకుండా ఎట్లా ?"

ధర్మరాజు అనునయంగా మొహం పెట్టాడు బుర్ర గోక్కున్నాడు జాతకం కాయితాలు నాకాడ లేవండి కాని నాది సింవ రాశండి. మీరు పెద్ద బుగతోరు గదా, ఏటాగైన సిన్నగ నా అదురుట్టం సెబితే, మా వూర్లో అందరికి తవరి పేరు సెప్పు కుంతను. మీ కేటయినా యివ్వమంటే యిస్తను."

పంతులు కొన్ని క్షణాలు ఆలోచించాడు. చివరకు, "సరే. నిన్ననే వారఫలాలు రాసి శ్రీకాకుళంలో ఇచ్చి వచ్చాను. నీ రాశేమిటన్నావు, సింహమా? వారఫలం చెబుతాన్లే" అంటూ తన చేతి సంచీలోంచి కాగితాల కట్ట తీసి వాటిల్లోకి చూసి అన్నాడు : "సింహరాశి వారికి ఈ వారంలో అదృష్టం గొప్ప అదృష్టం కలిసొస్తుంది. ద్వితీయమందు గురుడున్నాడు కాబట్టి నీకు హఠాత్తుగా డబ్బొస్తుంది..."

"ఏటి,డబ్బొస్తాదండి! ఎప్పుడేటండి?" ముందుకు వంగి ఆత్రుతగా అడిగాడు ధర్మరాజు

# ఆ శుభ ఘడియల కోసం...



## శుభప్రదమైన
## చిక్కటి రుచుల సిరులొలికే టీ

మీరెప్పుడు రుచిచూస్తే అప్పుడు శుభయోగం.
ఇదే జెమినీ జ్యోతిష్యం. రుచి, చిక్కదనం,
ఈ రెండు లక్షణాలు గలది. ఆ టీయే జెమినీ టీ –
దీనిపై రెండేనుగుల చిహ్నం – శుభశకునం –
టీ తాగటం, ఫలితం పొందడం.






# జెమినీ టీ

టాటా-ఫిన్లే ఉత్పత్తి




## బొంబాయిలో గణేశ్ చతుర్థి

ఈ ఏడాది కూడా ఎప్పటిలాగే మహారాష్ట్రలో గణపతి చతుర్థి బ్రహ్మాండంగా చేశారు బొంబాయిలో గణపతి ప్రతిమను సముద్రంలో నిమజ్జనం చేసేముందు ప్రజలు పెద్ద సంఖ్యలో భజనలతో, వివిధ వాయిద్య మేళవింపులతో రకరకాల ఆటల పాటలతోను పెద్ద ఊరేగింపుగా దేవుణ్ణి తీసుకొని వెళ్ళారు

బొంబాయిలో వివిధ ప్రాంతాలలో జరిగిన ఊరేగింపులలో ప్రజలు ఎక్కువ సంఖ్యలో అత్యంత ఆనందోత్సాహములో పాటలు పాడుతూ, నృత్యాలు చేస్తూ కోలాహలంగా కదిలారు

శాస్త్రీ హాల్ సార్వజనిక గణేశోత్సవమూర్తి నిమజ్జనం ందు "గావ్‌దేవి మార్గం" నుంచి వచ్చిన మహిళలు ఇలా పాడారు

పార్వతీచ్యా నందనారే మోరయా
గజననా బా గజవదనా!

కామాటీపురం స్త్రీ - పురుషులు తెలుగు భజనలు చేశారు

ఉత్తర భారతీయ బాలురు తాళాలతో ఇలా పాడారు

జయ గణేశ్! జయ గనేశ్!!
జయ గనేశ్‌దేవా!!!
మాతా తేరీ పారవతీ
పితామహాదేవా

సి పి టాంక్‌నుండి గుజరాతీ భాషలో ఇలా పాడారు

శ్రీ శంకరసుతనే ప్రణముంరే
మాగూ మతి మనోహర సారే
ముజ మంథనే కరుణా కరో రే
గణపతి యుద్ధి దాతారా!

ఇలా భజనలతో, మరాఠీ, గుజరాతీ, తెలుగు పాటలతో మేళతాళాలు వాయించుకుంటూ గణపతి విగ్రహాలను సముద్రంలో నిమజ్జనం చేశారు పై చిత్రంలో కనపడే గొప్ప దృశ్యం అదే

—మాస్టర్ రవ్వభూమేశ్వర్

## అష్టమంలో శని

"చెప్పనీ మరి వచ్చే మంగళవారం, తప్పితే బుధవారం నీ చేతుల్లోకి డబ్బు రావటం ఖాయం రెండువేలదాకా రావచ్చు అయితే, ."

"రెండు యేలే!" ధర్మరాజు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు

"అయితే, . అదృష్టమందు శని వున్నాడు వీడు పాపి కనక నీ చేతిలోకి వచ్చిన డబ్బు విలవదు ఎట్లావచ్చిందో అట్లాగే పోతుంది ఇంతకన్నా ఈవారంలో చెప్పకోదగ్గ విశేషాల్లేవు"

ధర్మరాజు కొంచెం నిరుత్సాహపడి వెనక్కు తగ్గి గోడకు అనుకునుండిపోయాడు అరనిముషం తర్వాత, "ఏటండి పంతులుగోరు సెప్పేరు? సేతిలకొచ్చిన డబ్బు యెట్ట గెల్లిపోతది? నాను యెర్రిమొగాణ్ణనుకున్నరేటి, డబ్బు వొగ్గేను కోటానికి! ఎం ఎం అదయ్యే పనికాదు"

పంతులు మొహంలో చిరాకు తొంగిచూసింది "అందరూ చెప్పే జ్యోతిష్యాలు అందరికీ పట్టవ్వవు కొన్ని కొందరికే పట్టిస్తాయి అది అక్షాంశరేఖాంశాల్లో తేడాలవల్ల జరుగుతూంటుంది కాని, నా లెక్కలు మాత్రం ఈ ప్రాంతం వాళ్ళకు చాలామందికి పట్టిస్తాయి ఇది నా అనుభవంలోని విషయం ఇప్పుడు నీ విషయంలో ఎవరి లెక్కయినా తప్పచ్చునేమోగాని, నా లెక్క మాత్రం తప్పటానికి వీల్లేదు నీ చేతులోకి ఎంతో కొంత డబ్బు రానూ వస్తుంది, పోనూపోతుంది నీ ఇష్టమైతే నమ్ము లేకపోతే మాను" ఇట్లా అంటూ పంతులు కాగితాలను తన సంచీలో దోపుకుని, లేచినుంచుని, పంచె కండువాలను ఓమాటు సవరించుకొని, బిల్లు చెల్లించటానికి కదిలాడు

ధర్మరాజు వెనకనుంచి బిగ్గరగా, వెకిలిగా నవ్వాడు పంతులు బిల్లు చెల్లించి, వెనక్కోమాటు కోపంగా చూసి, విసవిసా బయటికి నడిచాడు

* * *

అంతవరకూ దూరంగా కూర్చొనున్న రెండోవాడు గబగబా లేచివచ్చి ధర్మరాజు పక్కన కూర్చుంటూ, "సిన్నగ సోమెట్టంరారె (కొంచెం చోటియ్యి) ఏట్రా బుగతంటన్నడు?" అన్నాడు

ధర్మరాజు లేచినుంచున్నాడు "నడుసుకుంటా ఊసులాడుకుందవుం లెయ్యి" అన్నాడు

ఇద్దరూ బిల్లు చెల్లించి బయటకు కదిలారు అడితీ దాటాక ధర్మరాజన్నాడు "జగన్నాదు, పంతులేటంతన్నాడో యెరికా? రేపు జయోరం నా సేతిల రెండుయేలు యెల్లిపోయొచ్చేసేస్తదంట! అయితె, మల్లి బేగి పారెల్లిపోతదంట! పిచ్చెదవ, మనేవంటె యేటనుకున్నడో సరయితె, అడ్ మాటబట్టి మనకిచ్చేదు డబ్బు లెట్టా గొస్తాయి?" ధర్మరాజు తన జేబులోంచి రెండు బీడీలు తీసి ఒకటి జగన్నాధు కిచ్చాడు ఇద్దరూ బీడీలంటించుకున్నారు సవిలాసకంగా పొగను పైకి వదులుతూ జగన్నాధు అన్నాడు 'ఎట్టాగేట్రా, మన మామ్మోలు వుద్దోగవేం - దొంగలాడిసేటవేం (దొంగతనం చెయ్యటమే)!" ధర్మరాజు, "నేనాడితా యేటని సెప్పినానెరికా?

# అష్టమంలో శని

కాశీబుగ్గల బ్రోకరుగుంతన్నవి!" అంటూ పకపకా నవ్వాడు.

ఇద్దరూ నడుస్తున్నారు. ధర్మరాజ హఠాత్తుగా, "యెరికయిపోయినాదేశ్!... జయోరం రాత్తిరికి యీ రోడ్డుమీద కాసేపి కార్ల (కార్లను) దొంగలాడీసేద్దవుం. ఏటంటవు?"

"రైట్."

ధర్మరాజ అన్నాడు: "ఇదిగో దిగో రారె, నా ఆలోశనవుం జయోరం రాత్తిరి గొప్పిలినుంచి నివ్వు, గోకర్ణపురవుం నుంచి నేను, లాస్టుబస్సుల యెల్లిపోయొచ్చీసి రైలు గేటుకాడ దిగిసేస్తము. తొలేత (ముందర) పాత్తంగి సిరిపురవుం నుంచి అప్పలసామి, జిల్లుళ్ల నుంచి సింహశెలంగోడు అక్కడికొచ్చీసి వుంటరు. నివ్వు గేటుకాడ్నుంచి అట్టగట్టగ అడ్డంగ నడిసీసి యిక్కడికెల్లి పోయొచ్చీసేస్తవు ఇదిగిదిగో యీ సాల (పశువుల శాల) కాడ పాసి సెట్టెక్కుస్తవు (పాచవిచెట్టు — పొడుగ్గా ఎదిగే ఒక వృక్షం) నివ్వు సేతుల పెద్ద బాటరీ యెట్టుగునుంటవు. మేవందరవూం అక్కడ గేటుకాడ్నుంచి నడిసీసి శాసనాం సెంటరు కొస్తము అక్కడ మహేంద్రవుం నదిమీద బ్రిడ్జికాడ యింకో గొప్ప పాసిసెట్టున్నాది కాదా, సింహశెలంగోడు ఆ సెట్టెక్కేసిస్తడు. ఇంకో బేట్రీ అట్టుగుంతడు. ఇక్కడికాడ్నుంచి నివ్వు లైటు కొట్టినవంటె ఆడ కనుపిస్తది ఆడు కొడితె నీ కనుపిస్తది ఇక్కడికాడ్నుంచి అక్కడికి మూడుమైళ్లే దూరంకాదా! యింకా, రోడ్డుకూడ పంద్రవంకలాగ వంకరగున్నాదికాదా, అందుకనుపిస్తది. నేను, అప్పలసామి అక్కడే బ్రిడ్జి కింద దాక్కునుంటవుం.

ఉప్పుడేటవుతాదంటె యీ అరిపురం సెంటరుకాడ్నుంచి యేటయిన సిన్నకారొచ్చినాదంటె, సింహశెలంగోడికి నివ్వు బాట్రీ కొట్టెయ్యి. దానికి సూసీసినట్టు ఆడు మల్లి నీక్కొడతడు, మాకు కిందికి ఊలేస్తడు (ఈలవేస్తాడు). మేవుం కింద సిద్దవుంగుంటవుం.

డబ్బున్నోళ్ల కారు కాకపోతె, అంటె, ట్రాక్టరో లారీయో అయితె నివ్వు బాట్రీ కొట్టొద్దు. ఆ కారు బ్రిడ్జికాడి కొచ్చితలికి సింహశెలంగోడు మల్లి నీకు లైటు కొడతడు రోడ్డుమీద మావాం కారడ్డేసి దాన్ల పన్ని (దువ్వెన) కూడ మిగలకుండ దొంగలాడేసేస్తము ఆడు అప్పుడు ఆడి వాగి (కండువా) అడ్డేట్సేసి నీకు ఎర్రలైటు కొడ్తాడు. అప్పుడు నివ్వు దిగిపో. మనవందరవూం మళ్లి రైలుగేటుకాడికి బేగెల్లిపోయొచ్చీస్తము మొహంతో వోరి తోట్ల కూసుని పంచీసుకుందము... ఉప్పుడేటంటె, ఆ కార్ల అల్లుగాని కంగాళి (గొడవ) సేసినరంటె నేను కస్సున పొడిసేస్తను. ఆ తరాతేటయితె మనకేటి? ... ఎట్టాగుండేటి మన ఆలోశనవుం?" ధర్మరాజ సగర్వంగా మూతిమీదలేని మీసాన్ని దువ్వుకున్నాడు.

జగన్నాధుకళ్లు మెరిసాయి "యేరుశెనగలొలిసేసుకుని తినీసినయెలుగ్గొడ్డులాగుందిర నీ బుర్ర!



నీ బాబులయింకా బీడీవుంటె యియ్యి'' అన్నాడు.

ధర్మరాజ ఇంకో బీడి తీసి జగన్నాధు కిచ్చాడు. "వొకిటికాదు, వందిస్తను నివ్వు మాత్రరం ఎర్రలైటు సూసీగానే గేటుకాడి కొచ్చీయాల. నాకు సాయవుం సెయ్యాల వాసేతిల కొచ్చిన డబ్బు ఎట్టపోతదొ సూస్తను ఆ పంతులు వొట్టి పిత్తబరికెబుర్రేదవని సూపిస్తను.''

ఇద్దరూ ఎడమకి తిరిగి, రోడ్డు నిగి, పొలాల్లో నుంచి అడ్డతోవ పట్టారు సింహాచలానికి, అప్పలస్వామికి ఈ కబురెట్లా అందచెయ్యాలో, తమ ప్లాను విరాఘాటంగా అమల్లోకి రావటానికి ఏవేవి ఆయుధాలు తీసుకోవాలో, ఎన్నెన్ని జాగ్రత్తలు తీసుకోవాలో,— అన్నీ వివరంగా వర్చించుకొన్నారు చివరకు విడిపోయారు.

* * *

శాసనాం సెంటరనేది, మందసా మీదుగా పర్లాకిమిడి వెళ్లే రోడ్డు, ఐదో జాతీయ రహదారి నుంచి చీలేచోటే కాని, అక్కడ ఊరేం లేదు

అమావాస్య రోజులు. టైము ఒంటిగంట

తాము ముందు అనుకున్నట్టుగానే ధర్మరాజ తన మిత్రులతో శాసనాం సెంటరుకు పొలాల్లోపడి వచ్చాడు. అదేవిధంగా రోడ్డుమీద నడవకుండా, రోడ్డు పక్కనున్న సర్వు తోటలోంచి నడుస్తూ వెళ్లి మహేంద్రతనయ బ్రిడ్జి కింద అప్పలస్వామితో కలిసి కాసాడు. ముగ్గురూ కొద్దిగా తాగివున్నారు. మొహాలకు మసి పూసుకున్నారు. నిక్కర్లు, బుష్‌షర్టులు వేసుకొని, నిక్కర్ల బెల్టులో చెరి రెండు బాకుల్ని దోపుకున్నారు సింహాచలం, మిగిలిన వాళ్లిద్దరూ కూర్చున్న స్థలానికి ముందరగా ఓ యాభై గజాల దూరం వెనక్కి నడిచి పొదని చెట్టెక్కి కూర్చున్నాడు

అరగంట గడిచింది. ఇటు ఎలాస నుంచి, అటు సోంపేట నుంచి లారీలు వచ్చాయి, వెళ్లాయి. అప్పుడు అందింది, సింహాచలానికి హరిపురం నుంచి లైటు సంకేతం సింహాచలం ఈలవేసి కిందికి, ధర్మరాజుకు ఆ సంకేతాన్ని అందజేసాడు ఇంకో పావుగంట తర్వాత ఇంకో ఈలవేసాడు

ధర్మరాజ గబగబా రోడ్డెక్కి, జేబులోంచి చిన్నపిల్లలాడుకునే వందరూపాయలనోటు తీసాడు. దానికి అంతకుముందే పూసిన జిగురును నోటి ఉమ్మితో తడిచేసాడు. రోడ్డుకు మధ్యగా, నేలమీద, దాన్ని అంటించాడు దూరాన టర్నింగ్‌లో లైట్ల కాంతి కనిపించగానే చటుక్కున వచ్చి రోడ్డు దిగి కూర్చున్నాడు.

కొత్త బాటరీలు బిగించిన కారణంగా ఆ బండి హెడ్‌లైట్లు చాలా కాంతిగా వున్నాయి. కానయితే బండికి ఎక్కువ స్పీడులేదు బ్రిడ్జి దగ్గరికి రావటానికి బండికి రెండు నిముషాలు పట్టింది. అది వచ్చి నోటు దగ్గర నెమ్మదిగా ఆగింది. డ్రైవరు ఇంజను ఆపేసాడు. బండి దిగి రెండడుగులు వేసాడోలేదో, రోడ్డుకు చెరొకపక్క నుంచి ధర్మరాజా, అప్పలస్వామి శరవేగంతో రోడ్డెక్కి బండివైపు దూసుకువెళ్లారు.

బెల్టుల్లోంచి చెరొక బాకూ స్వరున దూసి హెడ్‌లైట్ల కాంతిలో వాటిని ఒక్కసారి తళుక్కుమనిపించారు డ్రైవరు వెనక్కి గెంతి చటుక్కున తన సీట్లోకి ఎక్కబోయాడు. ధర్మరాజ అంతకన్నా వేగంగా గెంతి, డ్రైవరు గుండెమీద తన బాకు పెట్టి "కదిలినవంటె యిది కస్సున నీ బొందల దిగిపోతది. యాండ్సప్'' అన్నాడు. డ్రైవరు చేతులెత్తేసాం.

అవతలివైపున అప్పలస్వామి బండికి రెండంగల దూరంలో నుంచొని పరిశీలనగా చూస్తూ, "ఇగి జీపు బండే రారె'' అన్నాడు.

"జీపా!'' అని, "అయితేటి, కానియ్!'' అన్నాడు ధర్మరాజ

అప్పలస్వామి, "బండ్ల బాబులందరూ దిగాల. మీకాడున్న డబ్బు వూడ్సేసి నా సేతులెట్టాల. లాకపోతె, మిమ్మల్నందర్నీ పొడిసేసి మావెల్లిపోతము యేగిరం, యేగిరం ..''

పది సెకన్లు గడిచాయి. బండిలోంచి ఎవ్వరూ దిగలేదు.

ఇవతలపక్కనున్న ధర్మరాజ నిశ్శబ్దంగా తన బాకుతో డ్రైవరు చొక్కామీద నిలువుగా గీసేసాడు డ్రైవరు చొక్కా స్వరున చిరిగింది. చర్మం కూడా గీసుకున్నట్టుందికాబోలు, అతగాడు "చంపకు, బాబోయ్, నీకు పుణ్యం వుంటుంది. నాదగ్గర డబ్బులేదు...సార్, నన్ను చంపేస్తున్నాడు సార్, దిగండి సార్'' అన్నాడు.

అవతలవైపు నుంచి ఆఫీసరులాగా వున్న ఒక వ్యక్తి, వెనకాల సీట్లల్లోంచి ఇద్దరు ప్యూన్లూ దిగారు.

అప్పలస్వామి, "వూ, యేగిరం. డబ్బిచ్చీయండి ఆలీసెమయినాదంటె ముగ్గురూ సచ్చినారన్నమాటే ''

ఆ దిగిన ముగ్గురు మొహాల్లోనూ భయం తొంగిచూసింది. ఆఫీసరు కొంచెం గుండెదిటవు చేసుకొన్నట్లున్నాడు. "సరే, మీక్కావలసింది డబ్బేగా. మా దగ్గరవున్న డబ్బంతా ఈ సంచీలోనే వుంది,'' అంటూ బండిలో నుంచి తన ఎటాచీ తీసి అప్పలస్వామి కివ్వబోయాడు.

అప్పలస్వామి పుచ్చుకోలేదు. "అట్టగిస్తె కుదర్దు. తెరిసి సూపెయ్యి.'' అన్నాడు.

ఆఫీసరు బాగ్ తెరిచి హెడ్‌లైట్ కాంతిలో అప్పలస్వామికి చూపించాడు. అప్పలస్వామి చూసాడు. అందులోని కొత్త నోట్లకట్టలు చూడగానే అతని కళ్లు మెరిసాయి.

"అందిల ఎంతున్నాదొ సెప్పు.''

"మూడువేలు ''

"ఇటిచ్చెయ్యి.''

ఆఫీసరు బాగ్ ఇవ్వగా అప్పలస్వామి ఎడంచేత్తో దాన్ని అందుకొన్నాడు. బండి బానెట్‌మీదగా ఇవతలికి, ధర్మరాజుకి, అందించాడు. ధర్మరాజ కూడా దాన్ని తన ఎడంచేత్తోనే అందుకున్నాడు తన చంకలో నొక్కి పట్టుకున్నాడు.

"బండెక్కేసెండి యెల్లిపొండి. మాకట్టుకొటావిగ్గాని యెదవ్వేసా లేసినరంటె ఒకడయిన సచ్చినాడన్నమాటె'' అన్నాడు అప్పలస్వామి

వాళ్లు ముగ్గురూ జీపు ఎక్కారు

డ్రైవరు ఇంజను స్టార్టు చేసాడు

అప్పలస్వామి ధర్మరాజువైపు గెంతి "బేగి, బేగి'' అన్నాడు.

ఇద్దరూ సర్వుతోటవైపు, రోడ్డుకిందికి, గెంతబోయారు

* * *

"హాండ్సప్ !''

హఠాత్తుగా కేక వినిపించటమూ, రోడ్డుకు చెరొకవైపునుంచి టార్చిలైట్ల కాంతి వచ్చి వాళ్లిద్దరి మొహాలమీద పడటమూ, ఒకేసారి జరిగాయి

స్టార్టయి ఉన్న జీపు స్వరున వెనక్కు పాతిక గజాలు నడిచిపోయి ఆగింది ఆ హెడ్‌లైట్ల కాంతిలో ధర్మరాజుకూ, అప్పలస్వామికీ కనబడిన దృశ్యం ఇది : రోడ్డుకు ఇటు ముగ్గురూ, అటు ముగ్గురూ రిజర్వు పోలీసులు తుపాకులు వీళ్లవైపు గురిపెట్టి ఉండటం !

తెల్లబోతూ, నోట మాటరాక నిశ్చేష్టులై పోయిన ఇద్దరూ కత్తులు కిందపడేస్తూ చేతులు పైకెత్తేశారు !

* * *

ఆ రాత్రి ధర్మరాజా, అప్పలస్వామీ సోంపేట పోలీసు స్టేషన్లో పోలీసుల చేతుల్లో చావుదెబ్బలు తిన్నారు.

పోలీసులు వాళ్లను చేతికర్రలతో కొడుతూ, బూటు కాళ్లతో తంతూ, బూతులుతిడుతూ, మధ్య మధ్యలో అన్న మాటల్నిబట్టి వాళ్లిద్దరూ గ్రహించిన విషయమేమిటంటే, వాళ్లు ఆపింది 'డబ్బున్నవాళ్ల కారు' కాదు. డి. ఇ. వో. జీపు !

ఆ చీకట్లో వాళ్లిద్దరికీ కనబడకుండా జీపు వెనకాల ట్రెయిలర్ కూడా వుంది. సోంపేట కాలేజీకి అందివ్వటానికి ఇంటర్మీడియెట్ పరీక్ష పేపర్లు తీసుకొస్తున్న డి ఇ. వో కు రక్షణగా ఆ ట్రెయిలర్లో రిజర్వు పోలీసులున్నారు ! ఆ పరీక్షల తాలూకు డబ్బు మూడు వేలు ఆ సమయానికి డి. ఇ. వో. దగ్గరుంది !

రెండోరోజున జగన్నాధు ఒక ముసలమ్మను వెంటబెట్టుకుని "చుట్టాన్నం''టూ పోలీసు స్టేషనుకు వచ్చాడు.

కటకటాల్లోపల్నుంచి ధర్మరాజ జగన్నాధు వడిగాడు : "దొంగలంజికొడక, జీపు బండికి లైటు కొట్టొద్దురంటె కొట్టుతవు ? లైటికొట్టీసింతరాత విన్నేటి సేస్తవో సూడు !''

పౌరుషంగా అన్నాడు జగన్నాధు : "నాను జలాంతరకోట రాజుగోరి కారుకె లైటుకొట్టినను. అది మద్దిలొ జీడితోటలకాడ సెడిపోయినాది ఆ పూసు నాకేటెరిక? ఎప్పటిలకి సింవశెలంగోడి ఎర్రలైటు నాకు సూపునేకపోతె నానేటి సేస్తను? వల్లగ సెట్టు దిగిసి రోడ్డుమీద నడిసొస్తంటె మద్దిలొ రాజుగోరి కారు అగపడినాది 'తికమకయి పోయినాదేటా' అనుకుంట నాను శాసనాం వొచ్చితలికి అక్కడ ఎవుడూ లేడు ! మీరిద్దరు మావగోరింటి కెల్లిపోయొచ్చీసినరని యీ పొద్దు పేల నాకెరికయినాది. నాని తప్పేటున్నాది? యీ ముదనష్టపు జీపట్టుగొని మీరు సస్తరని నాను కలకమక్కున్ననేటి ?''

ధర్మరాజ శూన్యంలోకి చూస్తూ వుండిపోయాడు.

సీరియల్

# నళిని

## చిట్టారెడ్డి సూర్యకుమారి

**చ**క్కని శిల్పాలతో కంటి కింపు అయిన రంగులతో నిర్మింపబడిన దేవాలయమా ? లేక మయుడు నిర్మించిన కామ గమనము గల సౌభక నగరమా? అని చూపరులకు విభ్రాంతిని కలిగిస్తుంది అందమైన హర్మ్యం.

అందమైన హర్మ్యంలోనుంచి స్వామి ఇస్తున్న సందేశం మురళిరవళిలా ఆ ప్రదేశమంతా మధురంగా వ్యాపిస్తోంది. అక్కడ కూడిన జనం ఏకాగ్రతతో శ్రవణేంద్రియాలను నిలిపి వింటున్నారు. ఆయన ఏం చెప్తున్నారో! వీరు గ్రహించినట్లుగా ఆ సందేశ సారాన్ని గ్రోలుతున్నట్లుగా లేదుగాని నాగస్వరానికి, లేదా మురళినాదానికి తన్మయులై మత్తులాంటి భక్తికి తలలూపుతున్నారు ఆ ప్రజలు. స్వామి కంఠం విప్పి ఆవేశంగా, భక్తిభావంతో, పరమాత్మ గురించి, ప్రేమ గురించి, నామ స్మరణలోని మహత్యం ఉదాహరణాలతో ఉపమానాలతో చెప్తున్నారు... ..

"ప్రేమ, శాంతి, సత్యము ఆనందములు సహజములు. ద్వేషము, కపటము, ఆందోళన, దుఃఖము అసహజములు నీ పుట్టుక ఎక్కడో! నీవు ఎక్కడనుంచి వచ్చితివో తెలుసుకొనుము. సర్వమానవ ప్రేమను పెంచుకొని సమదృష్టితో చూడండి సర్వజీవులలోను. చైతన్యశక్తి అయిన పరమాత్మ ఉన్నాడనే భావంతో సర్వులను ప్రేమించే స్వభావాన్ని పెంచుకొనండి ... ప్రేమస్వరూపులారా !... సర్వ కర్మలను భగవత్ కైంకర్యముగా ఫలాపేక్షలేకుండా అర్పితముచేసి చిత్తశుద్ధి కలిగి జ్ఞానజ్యోతిని తెలుసుకో మనస్సును భ్రాంతులకు లోబడనీయక కీర్తి సంపదలను ఆశించక శాశ్వతమైన ఆనందమును పొందుటకు మనస్సును పోనిమ్ము. నీ మనస్సే నీకు గురువగును ... దైవాత్మ స్వరూపులారా ... ఒకపర్యాయము మనస్సు శ్రవణాసిధి ధ్యాస ధ్యానములను రుచి చూచిన అటులనే ఉన్నత స్థాయికి వచ్చును.

కుమ్మరి చేసిన మట్టివిగ్రహము పూజించుటకు మనసే కారణము..." బాబా వాక్ప్రవాహము మధురంగా సాగిపోతూంది.

ఆ శాంతినిలయంలో భక్తిప్రభావంతో

**( గత సంచిక తరువాయి )**

ప్రశాంతత ఆ చుట్టూ ఆవరించుకొనివుంది.

ఆ నిలయంలో ప్రజలు తమ కష్టసుఖాలు అన్నీ ఆయనపై వేసినట్లు నిర్భయంగా వున్నారు తమ కోరికలు నెరవేరాలని కొందరు కోరుకొంటూ, సాష్టాంగప్రణామాలు కటిక నేలపై వుండి చేస్తున్నారు. భక్తిభావంతో వున్న విదేశీయులే ఎక్కువగా వున్నారు పాశ్చాత్య వనిత ఇసుకలో కూర్చుని వడిలోని కొడుక్కి పక్కా తెలుగు పడుచులా చన్ను ఇస్తోంది.

కేవలం గారడీ విద్యతో అంతమందిని వివిధ దేశాలవారిని ఆకట్టుకోవడం కష్టం మానవాతీతమైన శక్తులు ఏదో ప్రభావం వుండబట్టే అంతమంది ఒక్కదగ్గర కూడగలిగారు మానవుడికంటే గొప్పవాడు. వప్పుకోక తప్పదు.

చప్పట్లతో దేవునికి జేజేలు కొట్టుతున్నారు జనులు తమ కష్టాలు, సమస్యలు తీర్చుకోటానికి సందేహనివృత్తికి కొందరు, పడిగాపులు కాస్తున్నారు. స్వామి ఇంటర్వ్యూ లభించాలని ఇష్టదేవతలకి మొక్కుకుంటున్నారు.

చెప్పుల్లేని కాళ్ళతో కష్టంగా ఆ ఇసుక నేలమీద నడుస్తూ అందర్నీ చూస్తూ పరిశీలిస్తూ వస్తోంది నళిని.

ఇప్పుడు ప్రశాంత నిలయానికి చాలా దగ్గర్లోకి వచ్చారు సుమారు పాతిక మైళ్ల దూరంలో వున్నారు. అనుకున్నప్పుడు వస్తుంటారు. అమ్మని, రాజకుమారిని చూస్తారు నీలున్నప్పుడు ఒకటి రెండు రోజులుంటారు. రాజకుమారి, ఆ పిచ్చి ఆ దుఃఖం నుంచి బయట పడింది. డాక్టర్లు, పిచ్చి కాదన్న పిచ్చి పూర్తిగా నయమైంది.

ఈ మాయాప్రపంచంలో వున్నదంతా వ్యర్థం, బూటకం అని గ్రహించినట్లు తామరాకుపై నీటిబొట్టులా తానున్న ప్రపంచంలో తనకి సంబంధంలేనట్లు కాలం గడుపుతుంది. ఏమైతేనేం తన కూతురు దక్కింది కంటి ఎదురుగా ప్రాణాలతో తిరుగుతుంది. అది చాలు అనుకొంది పార్వతమ్మ.

'ఇంతమందిలో వారిని ఎక్కడ వెతకి పట్టుకోవడం. ఆ భజన మరో గంటకిగాని పూర్తికాదు. వెనక్కి మళ్ళింది నళిని. మనస్సు ఇంటిపైకి మళ్ళింది పిల్లల్ని వదలి వచ్చింది, అని తలచుకోగానే తల్లి మనస్సు తియ్యనైంది. వారిని వదలి తాను ఆశించినట్లు దూరంగా ఎక్కడికో వెళ్ళిపోగలదా! మోహన్ వాసవివైపు ఆకర్షితుడవుతున్నాడు. వారికి అవకాశము, ఏకాంతం కలిగించాలన్న ఉద్దేశంతో, వారికి ముందుగా తెలియపరచక అప్పటికప్పుడు బయలుదేరి వచ్చేసింది వస్తూ మోహన్ ఆఫీసుకు కబురు పంపింది. రాత్రి పదిగంటల లోపల ఇంటికి చేరుకొంటే సరిపోతుంది అని తలుస్తూ పోతున్నా, నళిని దృష్టి ఒకతనిపై బడింది వృద్ధాప్యమే గాక మరేదో బాధ కృంగదీస్తున్నట్లు నడవలేక చేతికర్ర సహాయంతో కాళ్ళు తన శరీరాన్ని లాగలేనట్లు అతికష్టంతో నడుస్తున్నాడు.

మామూలుగా నడుస్తున్న నళిని అతనిని కలుసుకుంది దాటిపోతూ ఆయన్ని చూసింది ఏదో భావం ఆమెను తొలిచివేయగా, అప్రయత్నంగా, ఆవేదనగా, అతని భుజాన్ని పట్టుకొంది. మాటలు కరువైనట్లు, ఆ వృద్ధ లొట్టపడి అద్దాలలో నుంచి గుచ్చి చూశాడు.

అతని కళ్ళు గుప్పుమని ఒకసారి వెలిగి ఆరిపోయాయి ఆ సమయంలో అతనికి కలిగిన దుఃఖావేశాన్ని అతిప్రయత్నపూర్వకంగా అణచుకొని. భుజంపై తేలిగ్గావున్న నళిని చెయ్యి పట్టుకొని హృదయానికి చేర్చుకున్నారు, డాక్టరు శంకర్ ఇద్దరి మనస్సులు చంద్రుణ్ణి చూసి ఎగిరిపడే సముద్రంలా వుంది అజయ్ స్మృతులు వారిని బాధపెట్టాయి కళ్ళు వర్షించాయి. వృద్ధుడు పెదాలు బిగించి నళిని వీపుని నిమురుతూ మౌనంగా వోదార్చారు

"ఎలావున్నావమ్మా! పెళ్ళయిందా ? పిల్లలు ఎందరు ? మరో అమ్మాయి. ఆ వాసవి ఎలా వుంది ?" ఇవన్నీ అడగాలని ప్రయత్నించి నోరు తెరిచాడు ఒక్కటీ అడగలేకపోయాడు

"అమ్మగారు ఎక్కడ ! క్షేమమా ? అప్పుడు ఎక్కడ వున్నారు ? మీరు నాకు అప్పుడు దొరికివుంటే" అలా అడగాలనివుంది నళినికి

"అజయ్ తల్లి అక్కడ వుంది" అని వరుసగావున్న ఆ బిల్డింగులవైపు చూశాడు మెల్లిగా నడుస్తూ ఆధారంకోసం నళిని భుజంపై చెయ్యి వేశాడు.

---

***జరిగిన కథ-13.*** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినీలు. తరువాత వాసవితో కలసి వాళ్ళవూరు వెళ్తుంది నళిని అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్ళి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు అక్కడినుండి హైద్రాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని తన తండ్రి మరణించగా, నళిని యిచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని అక్కడకు చేరుతుంది వాసవి అజయ్ తన తల్లిదండ్రులకు వాసవి, నళినీలను పరిచయం చేస్తాడు. వాళ్ళ దగ్గర శలవు తీసుకొని అక్కగారి పిల్లలతో కలసి హకీమ్‌పేట్ ఏర్‌ఫోర్స్ స్టేషన్‌కి వెళ్ళి, అక్కడివన్నీ చూసి, అక్క రాజకుమారి, బావ రావుగార్లతో మెస్‌లో పార్టీకి వెళ్తారు వాసవి, నళినీలు కొన్నాళ్లకు వాళ్ళు యూనివర్సిటీలో చేరగా, అజయ్ వచ్చి నళినీని తీసుకుపోతాడు అనుకోకుండా 'జూలాజికల్ రెస్ట్‌హౌస్'లో అజయ్, నళినీలు ఏకశరీరులైపోతారు. భారత్, పాకిస్తాన్‌ల మధ్య జరుగుతున్న యుద్ధంలో అజయ్, రావులు పాల్గొంటారు అజయ్ మరణించిన కొంత కాలానికి, నళిని గర్భవతి అవుతుంది. మోహన్, నళినిని ప్రేమిస్తున్నాడని తెలిసి వాసవి బాధపడుతుంది. నళిని అంగీకారంతో ఆమెను పెండ్లాడుతాడు మోహన్ నళినికి కొడుకు పుడతాడు. తరువాత మోహన్, నళినీలకు కూతురు పుడుతుంది నళిని మనసు మార్చడానికి వాసవితో అతిసన్నిహితముగా వుంటుంటాడు మోహన్

---

కొడుకు మృత్యువు స్లోపాయిజన్‌లా శరీరాన్ని మనస్సును తినేస్తుందని నళిని డాక్టరు 'గౌరి'ని చూడగానే గ్రహించింది.

పూజలోవున్న ఆ కాసేపుకూడా కన్నీరు ఆగనంటుంది.

''ఎవ్వరూ...? నళినీ ?!'' లేచి కూర్చుని నళినిని పట్టుకొంది. అజయ్‌ని పట్టుకున్నంత సంతోషం కలిగింది. నళిని చెంపలు నిమిరింది. అజయ్ స్పర్శ అక్కడ దొరుకుతుందని ఆశ. అజయ్ ఆ చెంపల్ని ముద్దుపెట్టుకొనివుంటాడు. ఈ అందమైన మెత్తని చేతుల్ని ఎదే పదే పట్టుకొనివుంటాడు. ఆప్యాయంగా ఆ చేతుల్ని తన చేతుల్లో ఇముడ్చుకుంది. ఆమె ఉద్వేగం, ఆవేశం తగ్గినాక నళిని వళయత్రాన్ని, స్తనాలను చూసి ఆమె వివాహితేకాదు, తల్లికూడాను! అని అనుకుంటూ ''బాగున్నావా తల్లీ!'' మొదటిసారిగా మాట్లాడింది.

రక్తబంధువును చూసి, తలూపుతూ ఆ వృద్ధురాలివి, తల్లిలాంటిదాన్ని వొడిలో తల వుంచి వెక్కి, వెక్కి ఏడ్చింది. వేదనగా ఏడుస్తుంటే కించిత్ ఆశ్చర్యంతో ఆ భార్యాభర్తలు ఒకరినొకరు చూసుకున్నారు

డాక్టర్ శంకర్ స్టౌవ్ మీద కాఫీ చేయటం పూర్తిచేసి గాజుగ్లాసులో పోసి నళిని చేతి కందించాడు.

''మీకో విషయం చెప్పాలి – తర్వాత ఏం చేయాలో మీరే నిర్ణయించండి'' అంటూ తను వాసవి వారింటికి వెళ్లడం నుంచి చెప్పింది. ముగించి తల ఎత్తింది. వారు వినింది నిజమేనా, ఈ ఆనందం కూడా తాత్కాలికమేనా, అని సంశయిస్తూ నళినివి కళ్లు ఆర్పకుండా చూస్తున్నారు

''నళినీ! బాబు ఎలావున్నాడు? ఏం పేరు పెట్టారు? మేము ఎలా చూడాలి?''

''బాబులో అజయ్ పోలికలు మీకు కనపడవచ్చు... బాబు పేరు గౌరీశంకర్.''

ఆ వృద్ధులు ఆనందం పట్టలేక ఏడ్చారు. ''వాసవి, ఆ పేరు పెట్టింది!'' అని మెల్లిగా చెప్పింది.

''నళినీ! నీవు మా అజయ్‌ను మాకు తిరిగి ఇచ్చావు. జన్మజన్మలకు నీకు ఋణపడివుంటాము తల్లీ!'' నళిని చేతులు పట్టుకొని కళ్ళ కద్దుకుంది.

వారికి ఆమాత్రం సంతోషం కలిగించినందుకు కష్టానికి, ఫలితం దొరికినంతగా తృప్తిగా వుంది.

హృదయ వేదన కాస్త తగ్గినట్లనిపించింది. వీలైనంత త్వరలో బాబును తెస్తానని చెప్పి వారిని విడవలేక విడిచి వచ్చింది.

నళిని ఇంటికి చేరుకునేటప్పటికి రాత్రి పదిగంటలైంది. బాబు నాన్న గుండెలపై పడుకొనివున్నాడు. బాబును నిద్రపుచ్చుతూ మోహన్ కూడా నిద్రపోయాడు. పాప ఆ గదిలో లేదు. వాసవి పాపను ప్రక్కలో వేసుకుని పడుకొంది.

నళినిని చూసి వాసవి ''భోజనంచేశావా!'' అంది.

''చేయాలనిలేదు.'' పాపను ఎత్తుకుంది. ''అల్లరి చేసిందా!''

''అమ్మ కావాలని చాలసార్లు అడిగింది.'' వాసవి చెప్తూ నళిని ముఖంలోకి చూసింది. ఏడ్చినందువలన నళిని కళ్లు ఉబ్బివున్నాయి. ఆ ముఖంలో ఏదో భయం, ఆందోళన గోచరిస్తున్నాయి.

''నళినీ ?!''

''అ...జ...య్ అమ్మా నాన్న కనిపించారు.''

''మైగాడ్! బాబు గురించి చెప్పలేదుకదా!''

నళిని గుటకల్ని మింగుతూ చెప్పానన్నట్లు తలూపింది. పాప తల్లి స్పర్శ గుర్తించి మెడ చుట్టూ చేతులు వేసింది. ప్రతిమలా కూర్చున్న వాసవిని వదలి తన గదిలోకి వచ్చింది



మోహన్ గుండెల మీద వున్న బాబును మెల్లిగా ఎత్తి వేరేగా పడుకోబెట్టింది ఆ తండ్రి కొడుకులను చూసి హృదయం కదలిపోయింది ఆ బాధలో గుండె ఆగిపోతుందనిపించింది. అలసిపోయినట్లున్నాడు మోహన్ సన్నగా గుర్రుపెట్టుతున్నాడు దుప్పటి కప్పుతూంటే అతని పాదాలకి నమస్కరించబుద్ధి కలిగింది అతని పాదాలచెంత శిరస్సు వుంచింది

*    *    *

కాలేజీకి పోతున్న వాసవితో నళిని చెప్పింది ''లీవు పెట్టేరా, బాబును శాంతినిలయానికి తీసుకొనిపోదువు ... నాకంటే నీకే తెలుసు – అన్ని విషయాలు మాట్లాడిరా, బాబు విషయం వారేమి తీర్మానించుకున్నారో తెలుసుకో...'' అని మెల్లి మెల్లగా చెప్తుంటే మోహన్ వచ్చాడు.

తనను తప్పించుకు తిరుగుతుంది. కోపం వచ్చినట్లుంది! మోహన్ లోలోన నవ్వుకున్నాడు.

నళిని చూస్తుండగా గులాబి తెచ్చి వాసవి తలలో గుచ్చాడు. ఆ చర్యకి చిత్తరపోయిన వాసవి ''బావా!'' అంది. అదేమి గమనించక, ''కాస్సేపుంటే నిన్ను కాలేజీలో డ్రాప్‌చేస్తా'' నన్నాడు.

నళినిలో కోపం, ఈర్ష్య వుంటాయని, ఆ ముఖంలో చూస్తానని, ఆశగా నళిని వైపు చూశాడు. నళినిలో ఏ మార్పులేదు. వాసవిలో కనిపించిన తొట్రుపాటులు కూడా లేవు. నళిని మనిషి కాదా! భృకుటి ముడిచి కోపంగా చూశాడు.

ఆ కోపంలోనే వాసవిని కాలేజీలో వదలి, ఆఫీసుకు వెళ్లాడు

లీవు పెట్టి వస్తానన్న వాసవి కోసం ఎదురుతెన్నులు చూడసాగింది నళిని పిల్లల్ని ముస్తాబుచేసింది వారు అప్పటికే అలసిపోయి నిద్రపోయారు. వాసవి రాలేదు టిఫిన్ బాక్స్ కూడా తీసుకొనిపోలేదు అని అనుకుంటూ బయటికి వస్తుంటే పడుకున్న మోహన్ లేచి నళిని వెనకాలే వచ్చాడు

తలంటుకొన్న వెంట్రుకలు బాగా చెదరి, అలసట ఆ ముఖంలో స్పష్టంగా కనిపిస్తుంది నల్లచీరలో మరీ తెల్లగా వుంది. మొయిలు

కప్పిన చంద్రిమలా వుంది. ఈ అమ్మాయి అంటే తన కెందుకు అంత పిచ్చి! మమత! తను ప్రేమించినంతగా ఆ ప్రేమను తను తిరిగి పొందటల్లేదనిపించింది.

మరో స్త్రీపై మక్కువ చూపిస్తే ఏ భార్య సహిస్తుంది భర్తమీద ఎంత ప్రేమ వుంటే అంతగా ఈర్ష్య వుంటుందంటారు. మరి వాసవి రావటం ఆలస్యమైతే తపించిపోతుంది. భర్తకంటే స్నేహితురాలిని ఎక్కువగా ప్రేమిస్తారని తెలియదు, వినలేదు అని అనుకుంటే మోహన్‌కి నళిని మీద నిజంగా కోపం వచ్చింది తనకేదో అన్యాయం జరుగుతుందనుకున్నాడు

వాసవి కొరకు బయటికి వెళ్లి తిరిగి వస్తూ హాలులో కూర్చుని తదేకంగా తననే చూస్తున్న మోహన్‌ని చూసింది.

"వచ్చి కూర్చో నీతో మాట్లాడాలి" అన్నాడు ప్రక్క కుర్చీలో కూర్చుంది

"నళినీ! ... వాసవి మన ఇంట్లో ఎంతకాలం వుంటుందీ? మనం సంఘ జీవులం. మనల గురించి బయట ఎంతో అసహ్యంగా చెప్పకుంటు న్నారు. పిటిషన్స్ రావడం ఎక్కువైంది "

కొత్త మాటలు వింటున్నట్లు కళ్లు పెద్దవి చేసింది నళిని.

"కళ్లులేని సంఘంతో మనకేం పని .."

"నిజమే ... కాని వాసవికి పెళ్లి కావాలి. ఓ సంసారమంటూ తనకి వుండాలి. పెళ్లి లేకుండా ఎంతకాలం మన ఇంట్లో వుంటుంది "

నళిని నేలచూపులు చూసింది.

నళినిలో చలనం కలిగించాలని "నలుగురు అనుకొనే మాటలు నిజం కావచ్చు, నీ సంసారం మరొకరిది కావచ్చు " నళినిని గుచ్చి చూస్తూ అన్నాడు.

నళిని నవ్వింది. పిచ్చిదానిలా నవ్వింది

"ఎంత త్వరగా వాసవి వెళ్లిపోతే అంత మంచిది హాస్టల్లో వుంటానికి ఏర్పాటు చేస్తాను."

"బావా! వాసవి లేని ఇంట్లో నేను వుండను ముందు నన్ను పంపేయండి వెళ్లగొట్టవలసింది నన్ను. రత్నమేదో, గులకరాయి ఏదో మీకు తెలియదు..."

"నళినీ! ?"

"బావా ' వాసవిని మీరు అర్థంచేసుకోలేదు నా చర్మంతో చెప్పులు కుట్టియిచ్చినా దాని ఋణం తీర్చుకోలేను వాసవి తన జీవితాన్ని తన సంసారాన్ని నాకు ఇచ్చింది అలాటిది నా బ్రతుక్కి అడ్డు వస్తుందా ?. బావా! వాసవిని ఏం అన్నా నేను సహించను."

"నళినీ! వాసవి సంసారాన్ని నీకు ఇవ్వట మేమిటి ? ఆ భ్రమలో వున్నావా? నళినీ! నేను నిన్ను ప్రేమించాను ఇష్టంగా పెళ్లి చేసుకున్నాను."

"మోహన్! వాసవి నీకు వాగ్దానం చేయబడ లేదూ? చిన్ననాటి నుంచి పరుల దృష్టిలో మీరు భార్యాభర్తలే. మిమ్మల్ని ప్రేమించి పూజించే వాసవి మీ అసలు భార్య. ఆమే మీ భార్య మోహన్! నేను...నేను... మీ భార్యను కాదు!"



# న ళి ని

ముఖాన్ని చేతుల్లో దాచుకుంది. ఆవేశంతో గుండెలు ఎగసెగసిపడుతున్నాయి

తననెవ్వరో చెళ్లుమని కొట్టినట్లు చూశాడు మోహన్ భృకుటి ముడిచి "నళినీ! నీవేమంటు న్నావో నీకు తెలుసా?" ఆ స్వరం కరుకుగా వుంది.

ఇంతవరకు వచ్చింది. ఇక ఆగలేకపోయింది నళిని.

"మోహన్! ఈ రహస్యం అగ్నిపర్వత గర్భ కుహరసాగ్నివలె ప్రతి నిముషం నన్ను దహించి వేస్తుంది, నేను బ్రతకలేను బావా! ... మీ జాలిని, ప్రేమను ఆసరాగా చేసుకొని మిమ్మల్ని మోసం చేశాను. నాకు క్షమ లేదు. క్షమించమని అడిగే అర్హత కూడా లేదు విధివంచితురాలను దైవోపహతులం ... నీ నీడను తలదాచుకున్నాం...

---

# తెగింపు

ఒక
మనస్సైన మనసు కోసం
అనురాగ మాధుర్యం కోసం
అద్వైత సమాగమం కోసం
లోకాన్నీ ఐశ్వర్యాన్నీ అందర్నీ
దేన్నైనా
మనిషి ఒదులుకోగా లేంది
ఈ
పీడితజన సమాజ వలయంలో
దోపిడీ దగా అన్యాయాక్రమాలు
తనదాకా ఒస్తే
తననే ఒదులుకోటానికి
సిద్ధమై
తిరగబడటం ఖాయం

— శ్రీమతి రేవతీదేవి

---

నేను... బా. బు... బావా! బాబు నీ కొడుకు కాదు." మోహన్ కాళ్లపై వాలిగిపోయింది.

ఆ మాటలు విషపూరితాలై అతని మనస్సును ఛేదించుకొనిపోగా నిర్వీర్యుడైపోయాడు.

"నళినీ! నాతోటి సంసారం నీకు సుఖప్రీతికరం కాకపోవచ్చు, వాసవికి న్యాయం చేకూర్చాలని నీకుండవచ్చు, నామీద ప్రేమ లేకపోవచ్చు, కాని ... బాబు నా కొడుకు కాదని చెప్పవద్దు. వాడు నా రక్తం పంచుకొని పుట్టలేదా? అబద్ధం ఆడవద్దు నళినీ..." పళ్లబిగువున అన్నాడు.

"అయ్యో! బావా!" అంటూ రోదించ సాగింది.

జుట్టుపట్టి తల పైకెత్తాడు. అతని కళ్లు నిప్పకణికలవలె మధ్యాహ్నపు సూర్యునివలె ఎర్రగా వున్నాయి.

"నళినీ! నా కళ్ళల్లోకి చూసి చెప్పు. నా కొడుకా? వీడు లేక నీ పాపఫలితమా? వూఁ చెప్పు ... చెప్పవే ... పాపిష్టిదానా..."

"బాబు ఎవ్వరి పాపఫలితంకాదు. మా ప్రేమ ఫలితం, అజయ్‌కు పుట్టినవాడు."

"పాప ... అదెవ్వరి ప్రేమ ఫలితం."

"పాప ... ప్రీతి!" ఆ తల్లి హృదయం గజగజలాడిపోయింది మోహన్ చేతుల్లో చిగురుటాకులా అల్లల్లాడిపోయింది. ఆవేశం, ఉద్వేగం, భయంతో శరీరం వణికింది ఫిట్సు వచ్చాయి. నురుగులు కక్కుతూ నేలపై పడిపోయింది. నళినిని చూస్తూ నిలుచున్నాడు. ఆ నళిని చచ్చిపోవాలని మనసారా దేవుణ్ణి కోరుకున్నాడు.

ఆ సమయంలో లోనికి వచ్చిన వాసవి ఆ దృశ్యాన్ని చూసింది. భయపడిపోయింది "నళినీ!" అంటూ ముందుకు వంగింది

"నళినీ! నళినీ" అంటూ నురుగు తుడుస్తూ "బావా! బావా! డాక్టర్ని పిలుచుకురా అలా చూస్తూ నిలుచున్నావేం" అంది ఏడ్పు స్వరాన.

"ఛే! దాన్ని ముట్టుకోకు ... అది చచ్చిపోవాలి! చచ్చిపోనీ."

"నళిని చావకూడదు! అది బ్రతకాలి! బ్రతుకులోని ఆనందాన్ని చూడాలి." ఆవేశంగా "అజయ్! అజయ్" అంటూ కేకలుపెట్టింది.

ఆ పిలుపులోని తొందరకి, భయానికి బయట ఆవరణంలోవున్న అతను, రణరంగంలో దెబ్బతిని బెదరిన అశ్వంలా దూసుకువచ్చాడు.

అతను కుంటుతున్నాడు. ఆసరాగా చేతిలో కర్ర వుంది. అతన్ని చూస్తూనే వాసవి "అజయ్! అజయ్! ఇదిగో నీ నళిని, నీ కొరకు పరితపించి పోతున్న నళిని. నీ నళినిని నీకు వప్పచెప్తా నన్నాను ఆ రోజు తీసుకుపో! బ్రతికించుకో" బిగ్గరగా ఏడుస్తూ చెప్పింది.

ఎదురుగా నిలుచున్న మోహన్ వైపు నిండుగా చూసి, స్థిరచిత్తంతో నిర్జీవంగా పడివున్న నళినిని ఎత్తి భుజాన వేసుకొనివచ్చినంత వేగంతో బయటికి వెళ్లాడు.

"నాన్నా! నాన్నా!!" నిద్రలేచిన బాబు పరుగెత్తుకొనివచ్చి మోహన్ చెయ్యి పట్టుకున్నాడు.

"ఏరా నాన్నా!!" అన్నాడు అలవాటుగా.

"అమ్మ? అమ్మ!?"

"అ...మ్మ చచ్చిపోయింది."

వెళ్లిపోతున్న అజయ్, బాబు స్వరం విని క్షణం ఆగాడు. కాని వెనుదిరిగి చూడలేదు ద్వారంలో నిల్చున్న గౌరీశంకరులు కన్నార్పకుండా తండ్రి చేతిని పెనవేసుకొని నిల్చున్న బాబుని, స్థిరచిత్తుడైన మోహన్ని చూశారు. వచ్చినంత మెల్లగా వెళ్లిపోయారు.

తన వంటిపెట్టుకున్న బాబు వైపు అతి ప్రయత్నపూర్వకంగా చూశాడు. 'అమ్మ చచ్చిపోయింది' అన్న మాటను అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూ ఏదో భయం ఏదో దుఃఖం కలిగినా నిర్భయంగా తనదగ్గర నిలుచున్నాడు.

తన గుండెలమీద పెరిగిన బాబు తనకు పుట్టినవాడు. కాదు... మోహన్ హృదయం మెలికలు తిరిగింది.

"నాన్నా"



"ప్రకృతి శక్తి" — ఫొటో ఏలేశ్వరపు నరసింహారావు

లోనికి వెళ్తున్న మోహన్ వెంట "నాన్నా! నాన్నా" అంటూ వస్తున్న బాబుని "ఏరా నాన్నా" అంటూ ఎత్తుకొని హృదయానికి చేర్చుకొని పసిపిల్లవాడిలా ఏడ్చాడు మోహన్

* * *

స్వాతంత్ర్యము తమ జన్మహక్కు అని నమ్మిన ఇండియన్లు పొరుగు సోదరులకోసం స్వప్రాణాలను ధారపోస్తున్నారు

ఇండియా సైన్యాలు విజిగీషులై పోరాడుతున్నారు బంకర్ల నుండి బంకర్లకి కాల్పులు జరుగుతున్నాయి ఒక మెషీన్‌గన్ నోరు మూయించాలన్న పట్టుదలతో ఎవ్వరి కంటపడకుండా తన స్థానం నుంచి బయటికివచ్చి పొట్టతో దేకుతూ ఆ బిల్డింగ్‌ను చేరుకున్నాడు అజయ్ అక్కడ పహరా ఇస్తున్న ఇద్దరు శత్రు సైనికులపై చేతిబాంబు విసిరాడు అక్కడికక్కడే వారు యమపురి కేగారు

నిముషం కూడా వ్యర్థంచేయక గోడ పైకి బల్లిలా ప్రాకిపోయాడు పైన మెషిన్‌గన్‌తో గురిపెట్టిన పాకిస్తాన్ సైనికుని చూశాడు అజయ్ ఆవేశపూరితుడై అరుస్తూ బాయ్‌నెట్ (తుపాకీకున్న కత్తి)తో అతనిపై విరుచుకుపడ్డాడు అతన్ని చంపగలిగాడుకానీ తుపాకీ గుండ్లతో అతని శరీరం తూట్లుపడింది

రక్తపు మడుగులో స్పృహతప్పి పడివున్న అజయ్‌ను పాకిస్తాన్ ఆఫీసర్ చూశాడు అతను బెంగాలీవాడు అజయ్ చేసిన సాహసం గుర్తించాడు అతను స్వదేశం కొరకు కాదు పొరుగునవున్న సోదరులకోసం పోరాటం సాగించాడు తాను బెంగాలీ దేశస్థుడు పాకిస్తాన్‌లో వుండిపోవడం వల్ల తన దేశ ప్రజలతోనే యుద్ధం చేయవలసి వచ్చింది అజయ్ లాంటి వీరులు చనిపోకూడదు, వారిని రక్షించడం తన కర్తవ్యం అని తలచాడు

తన బాట్స్‌మాన్ సహాయంతో (అతను బెంగాలీవాడు) తను వచ్చిన జీపులో అజయ్‌ను

# నళిని

చేర్చారు గుర్తుపట్టనట్లుగా చచ్చిపడివున్న పాక్ సైనికునివద్ద అజయ్ వస్తువులు వుంచారు (ఆ చనిపోయినది అజయ్ అనుకున్నారు) తెల్లగా పొడుగ్గా పెరిగిన గడ్డంతో వున్న అజయ్ ముస్లింలా వున్నాడు సురక్షిత ప్రదేశానికి చేర్చి తనవారికి అప్పగించాడు ఆ పని సులభంగానే జరిగిపోయింది

ఆ తర్వాత ఆ బెంగాలీ ఆఫీసర్ తన బాట్స్‌మాన్‌తో తన జీపులో పాకిస్తాన్ సైన్యం నుండి దొంగతనంగా, ఇండియా సరిహద్దుల్లోకి వచ్చేశాడు రెండువైపులా సైన్యాలు ఎవ్వరు చూసినా కాల్చివేసేవారు ప్రాణాలకు తెగించి తన దేశం కోసం వచ్చేశాడు

ఎంతో విలువైన శత్రు రహస్యాలు చెప్పాడు కాని తన మాతృభూమి బంగ్లాదేశ్‌కు పోయే తొందరలో అజయ్ సంగతి చెప్పలేదు చెప్పడంమరచాడు

విరిగిన ఎముకలు గాయాలు పూర్తిగా మానటానికి సంవత్సరం పట్టింది అడవి ప్రాంతం మారుమూల గ్రామంలో వున్న అజయ్‌కి బయట ప్రపంచం సంగతి తెలియనేలేదు

తెలుసుకునేసరికి తాను లోకం దృష్టిలో చచ్చిపోయాడు, వీర స్వర్గంలో వున్నాడు నిజంగా చచ్చిపోయి వుంటే తనంత అదృష్టవంతుడు మరొకడు లేకపోను అంగవైకల్యం — ముఖాన గాయపుగుర్తే కాదు మరింకేదో చెప్పుకోలేని లోపం వుందనుకున్నాడు నేను వున్నాను! అని ముందుకు వచ్చి చెప్పి వారి సుందర స్వప్నం చెడగొట్టలేను అనుకున్నాడు అనామకుడిగా వుండిపోయేడు

మాతృదేశంకంటే ప్రియమైనది మరొకటి లేదనిపించింది మెల్లగా పాకిస్తాన్ నుంచి బంగ్లాదేశ్‌కు, అక్కడనుంచి ఇండియాకు వచ్చాడు తన అధికారులను కలుసుకొని తనను తెలియపరచుకున్నాడు

అమ్మా నాన్న దేశాలుపట్టి తిరుగుతూ చివరికి శాంతి నిలయంలో వున్నారని తెలుసుకొనివచ్చాడు

గౌరీశంకరులకు కొత్తగా కలిగిన ఉత్సాహంతో బ్రతుకుమీద ఆశ చిగిర్చింది స్వామిని కలుసుకొని ఆశీర్వాదంతో అజయ్ కొడుకుని చూస్తానికి వెళ్ళే ప్రయాణ సన్నాహంలో వున్నారు. అజయ్ కొడుకునే చూస్తామనుకున్నవారికి కన్నకొడుకుని చూసే అదృష్టం కలిగింది అసలు — వడ్డీతో దొరికినంతగా సంబరపడ్డారు

అజయ్‌తో ప్రయాణమైనారు ముందుగా వాసవిని కలుసుకోవటం మంచిదని అభిప్రాయాన్ని తెలిపాడు అజయ్

జరిగిన గాథ వాసవి నోట విన్నారు జరిగిపోయిన తప్పును సరిదిద్దుకోలేని పరిస్థితులు

'నళిని' కొరకు తపించిపోయాడు పరదార స్మరించటానికి కూడా అనర్హుడు ఒక్కసారి నళినిని, తన కొడుకుని చూసి వారి జీవితం నుంచి పూర్తిగా నిష్క్రమించాలనుకున్నాడు మోహన్‌కి ఈ విషయాలు ఏమీ తెలియనీయరాదని జాగ్రత్తపడి వచ్చారు కాని విధి మరోసారి వక్రించింది

* * *

స్పృహ వచ్చిన నళిని ప్రియ ప్రియ అని పలవరించింది తన పాప, ప్రియ, అని అసహనంగా తల వూపుతూ కళ్ళు తెరిచింది తనవైపే చూస్తున్న అజయ్ కనిపించాడు 'అజయ్! అజయ్' అని పలుకుతూ కళ్ళు మూసుకుంది, మళ్లీ తెరిచింది అజయ్ ముఖం చెదిరిపోలేదు కరిగిపోలేదు

తను చచ్చిపోయింది అజయ్‌ను కలుసుకుంది "అజయ్! అజయ్! మనం ఎక్కడవున్నాం!" అంటూ చేతులు చాపింది ఆ చేతుల్లోకి రాలేకుండా వుండలేకపోయాడు అతని చెంపల్ని రెండుచేతుల్లో వుంచుకొని కంటి నుంచి గడ్డంవరకున్న పొడుగాటి గాయాన్ని చూసి సుతారంగా ముద్దుపెట్టుకొంది "ఈ గాయం అప్పుడు అయిందా! అజయ్! నన్ను వదలి ఎలా వెళ్ళావు! ఇక్కడ మనల్ని ఎవ్వరూ వేరుచేయలేరు కదూ! మన ఆత్మలకి చావూ, ఎడబాటు వుండదుకదూ! అవునా!"

అజయ్ నళిని ప్రేమలో కరిగిపోతూ నిశ్శబ్దంగా ఏడ్చాడు

"నళినీ! నీవు పరాయిదానివి నిన్ను తాకకూడదు మన ఆత్మలు ఒక్కటే కాని శరీరాలు ఇంకా వేరుగానే వున్నాయి"

నళినికి అప్పుడు మోహన్ గుర్తుకువచ్చాడు అజయ్‌ని పెనవేసుకుపోయింది

ఇది ఎలా సంభవం??

* * *

నళిని వాస్తవంలోకి వచ్చింది అజయ్, తన అజయ్ బ్రతికివున్నాడు అదే చాలు ఈ జన్మకి ఆ వరం చాలు, అనుకొంది

ఇప్పుడు తన స్థానం ఎక్కడ?

అజయ్ దగ్గర వుండనా! మోహన్ దగ్గరకు వెళ్లనా? ఇంత జరిగినాక మోహన్ చేరదీస్తాడా?

మరొకరితో పెళ్లయి అతనికి ఓ బిడ్డను కన్న తనను అజయ్ తిరిగి స్వీకరిస్తాడా?

[ 42వ పేజీ చూడండి ]

తెల్లదనపు ఆ శిఖరాన్ని అందుకునేది
ఒక్క రాబిన్ బ్లూతోనే

అన్నిటినీ మించిన నీలం
రాబిన్ బ్లూ.
నూలు బట్టలకోసం.
నికార్సయిన, ఎంతోసరిసమానమైన తెల్లదనం కోసం.
ఉతుకు ఉతుకుకీ మరింతగా.

రాబిన్ బ్లూ—
నూలుబట్టలకు తెల్లదనాన్నివ్వడంలో దీన్ని మించినది లేదు.




Rediffusion/R/889TLd

# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## కథానాయిక సోదరుడు కథానాయకుడుగా

"నేను ఏ డాక్టరో, ఇంజనీరో అవుదామనుకో లేదు సినిమా హీరో కావాలనే చిన్నప్పట్నించి కలలు కనడమే కాకుండా కృషికూడా చేశాను," అన్నాడు జయప్రద సోదరుడు విజయ్ "మా అమ్మగారివద్ద కూచిపూడి భరతనాట్యం నేర్చుకున్నాను 'శ్రీకృష్ణ రాయబారం' నాటకంలో కృష్ణుడుగా, 'రక్తకన్నీరు'లో ప్రధాన పాత్రధారిగా నటనలో అనుభవం సంపాదించాను దాసరి నారాయణరావుగారు తొలుదొల్త నాకు మేకప్ టెస్ట్ చేయించడం నా పూర్వజన్మ సుకృతం భరతన్ దర్శకత్వంలో తెలుగులో తయారయ్యే 'రతీ నిర్వేదం'లో జయభారతి సరసన హీరోగా, 'మంగళ తోరణాలు'లో తాళ్ళూరి రామేశ్వరితో, జయాచక్రవర్తి నిర్మించే 'మన ఊరి పాండవులు' తమిళ చిత్రంలో చిరంజీవి పాత్రను, 'షేల్ షేల్ మె' ఆధారంగా ఎస్ డి లాల్ దర్శకత్వంలో తయారయ్యే చిత్రంలో, బాపుగారి తదుపరి చిత్రంలో, భారతీరాజా దర్శకత్వంలో తెలుగు, తమిళ భాషల్లో సెట్స్‌కు వెళ్ళే చిత్రంలో ప్రధాన పాత్ర ధరిస్తున్నాను," అన్న ఈ స్ఫురద్రూపి మంచి స్పోర్ట్స్‌మన్ కూడా క్రికెట్, బేడ్‌మింటన్, టేబుల్ టెన్నిస్ క్రీడలలో ఘటికుడు



'పవిత్ర ప్రేమ'లో శ్రీలక్ష్మి



## శివమెత్తిన సత్యంలో సుతిమెత్తని సత్యం'

రాధ నిద్రపోతూందనుకుని సత్యం లేచి మెల్లగా తలుపు తెరిచాడు ఆ కిర్రుచప్పుడుకి రాధ లేచింది "ఏమండీ! ఇంత అర్ధరాత్రివేళ ఎక్కడికి వెళ్తున్నారు? పలకరేం? జైలు నుంచి వచ్చినప్పటినుంచి నేనేదడిగినా సమాధానం చెప్పటంలేదు చెప్పండి – ఎక్కడికెళ్తున్నారు?"

"రాధా! ఈరోజు నుంచి 'ఎక్కడికెళ్తున్నారు? ఏం చేస్తున్నారు? యెందుకు చేస్తున్నారు?' అన్న ప్రశ్నలే అడగొద్దు. ఎందుకంటే నేను నీకు అబద్ధం చెప్పలేను గనుక," అని సత్యం (కృష్ణంరాజు) చరచరా వెళ్ళిపోయాడు రాధ (శారద) అలాగే నిలబడి పోయింది

కృష్ణంరాజు సమర్పించే రాధాకృష్ణ మూవీస్ "శివమెత్తిన సత్యం" వన్నెల చిత్రాన్ని వి మధుసూదనరావు దర్శకత్వంలో జి సత్యనారాయణరాజు నిర్మిస్తున్నారు తెర వెనుక ఆత్రేయ, వి ఎస్ ఆర్ స్వామి, జె వి రాఘవులు, వి భాస్కరరాజు, వి జగదీష్, హీరాలాల్ నిర్మాణ పర్యవేక్షణ యు వి. సూర్యనారాయణ రాజు

'మహాలక్ష్మి'లో వాణిశ్రీ, రాజసులోచన





'మహాశక్తి'లో జయమాలిని



## "మనిషి-మృగము"లో మర్మమనిషి

నిద్రపోతున్న లక్ష్మి గదిలోకి ఆకస్మాత్తుగా వచ్చాడు రఘునాథరావు నిశ్చేష్టంతపోయిన లక్ష్మి "ఆగు! ఏమిటి నీ ఉద్దేశ్యం? నీ నీడలో తల దాచుకున్నానన్న లోకువా? అన్నం పెట్టి ఆదరిస్తున్నావన్న అహంభావమా? గుడిలాంటి ఇల్లు — దేవుడులాంటి అన్నయ్యా దొరికారని ఆనందించానన్న అలుసా?" అని గద్దించింది

"లక్ష్మీ! జరిగిపోయిన క్షణం, జారిపోయిన అవకాశం మళ్ళీ రావు కమాన్!"

"అడుగు ముందుకు వేయకు నా భర్త ఒక దొంగ, దోపిడీదారుడే కావచ్చు కాని, నా మెడలో మాంగల్యాన్ని కట్టింది ఆయనే నన్ను తాకే అధికారం ఆయనకే ఉంది అందుకు విరుద్ధంగా జరిగిందో—మిగిలేది ఈ లక్ష్మి శవం మాత్రమే!"

అయినప్పటికీ కూడా రఘునాథరావు ఆగకుండా మీదిమీదికి వచ్చాడు లక్ష్మి పెనుగులాడింది ఆ ఘర్షణలో రఘునాథరావు ముఖానికి ఉన్న 'మాస్క్' ఊడిపోవడం, తన భర్త రాజా ముఖం కనిపించడం చూసి అవాక్కయిపోయింది లక్ష్మి 'ఇంతకీ, అసలు రఘునాథరావు ఏమైనట్టు?' అనే విస్మయం ఆమె ముఖంలో కనిపించింది

కె ఎస్ రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె కమలారెడ్డి నిర్మించే కమల చిత్రా మూవీస్ "మనిషి—మృగము" వన్నెల చిత్రంలో జమున, జగ్గయ్య, కవిత, నరసింహరాజు, జయమాలిని, గిరిబాబు, కె ఎస్ రెడ్డి, ఎం ఎస్ గోపీనాథ్, సుంకరలక్ష్మి, కె. వి చలం, రాజారెడ్డి, మధుబాబు పాత్రధారులు

## కె ఎస్ రెడ్డి దర్శకత్వంలో మరో చిత్రం

"రెడ్డిగారి దర్శకత్వంలో 'కదలివచ్చిన కనకదుర్గ' అనే చిత్రాన్ని త్వరలో ప్రారంభించబోతున్నాము పేరాల సుబ్రహ్మణ్యం కథ, మాటలు రాస్తున్నారు," అని తెలియజేశారు సురేఖ ఎంటర్ ప్రైసెస్ అధినేత కె ఎస్ ప్రకాష్

## "సినిమా పిచ్చోడు" నిరాహారదీక్ష

సినిమా పిచ్చితో అస్తమానం ఊరివారందరినీ వేధిస్తున్నాడని — రాంబాబుమీద రోజారోజుకీ నేరారోపణలు ఎక్కువ కావడంతో విసిగిపోయిన బావ భూషయ్య, రాంబాబుని గదిలో పెట్టి తాళం వేస్తే, అతని కూతురు సీత వచ్చి, కిటికీ తలుపు తియ్యమంది "ఎంత ఆకలిగా ఉన్నావోనని అమ్మ అన్నం పెట్టి రమ్మంది," అంది

"ఎంతైనా అక్కయ్యది రక్త సంబంధం నీదీ, బావదీ బాదరాయణ సంబంధమేగా? మనసనే అన్నంలో మమతనే కూర కలిపి, అనురాగమే ఆవకాయపచ్చడిగా "

"అబ్బబ్బ! తింటావా, లేదా?"

"తిననంటే తినను ఆమరణ నిరాహార దీక్షతో ఇక్కడే ఈ గదిలో స్వాతంత్ర్యం కోసం ప్రాణాలు విడుస్తాను"



'ఏడంతస్తుల మేడ'లో అక్కినేని, జయసుధ

"అలాగే కానీ — పొట్టి శ్రీరాములంత గొప్పవాడివయిపోతావ్!" అంటూ వెళ్లబోయింది సీత

"సీతా! ఆగు! నీకోసం తింటాను అయినా, ఎలా? కంచం లోపలికి రాదు మూతి బయటికి పోదు పోనీ — కలిపిపెట్టు," అని రాంబాబు అనగానే సీత నవ్వి, ముద్ద కలిపింది

వై ఈశ్వరరెడ్డి దర్శకత్వంలో తమ్మారెడ్డి రంగారెడ్డి సమర్పించే భారతీ ఆర్ట్ పిక్చర్స్ "సినిమా పిచ్చోడు" వన్నెల చిత్రంలో గీత, జ్యోతి, అత్తిలి లక్ష్మి, విజయవాణి, జనప్రియ, గరగ, మల్లిబాబు, మోహనకృష్ణ, వినోద్‌కుమార్, ఎర్రమనేని చంద్రమౌళి, మోదుకూరి సత్యం, రఘునాథరెడ్డి ప్రధాన పాత్రధారులు అప్పలాచార్య సంభాషణలు, చక్రవర్తి సంగీతం, కె ఎస్ ప్రకాష్ ఛాయ, తెర వెనుక హంగులు టి రఘునాథరెడ్డి నిర్మాత



'విందు షూరేళ్ళ'లో సుభాషిణి, జయసుధ



# సి ని మా

## "సర్కస్ రాముడు''

ఎన్ టి ఆర్ ద్విపాత్రాభినయం, దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో కోవై చెళియన్ నిర్మించే కె ఏ ఫిలిమ్స్ ఇంటర్నేషనల్‌వారి ''సర్కస్ రాముడు'' వన్నెల చిత్రం షూటింగ్ అక్టోబర్ 20న బెంగళూరు పేలెస్‌లో ప్రారంభమవుతుంది జయప్రద, సుజాత, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, వాగేష్, జయమాలినిలతోపాటు రెండు ఏనుగులు ప్రధాన పాత్రలు వహిస్తాయి ఆర్ కె ధర్మరాజ కథకుడు మహదేవన్ సంగీత దర్శకుడు కె ఎస్ మణి ఛాయ, భాస్కరరాజ శిల్పం, బాలు కూర్పు నిర్వహిస్తారు

## జయకృష్ణా మూవీస్

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో ''సీతారాములు'' వన్నెల చిత్రాన్ని కృష్ణంరాజు ప్రధాన పాత్ర ధరిస్తూ సమర్పిస్తారని నిర్మాత జయకృష్ణ తెలియజేశారు

రామకృష్ణా సినీ స్టూడియోస్ సమర్పించు




కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వం: యన్.టి.రామారావు బి.ఏ.

## "గోరింటాకు"లో

### కార్ల జబ్బు నయంచేసే డాక్టరు

తన చెల్లికీ, తమ్ముడికీ ట్యూషన్ చెప్పడానికి రాము (శోభన్‌బాబు)ని ఇంటికి రమ్మంది రావు (ప్రభాకరరెడ్డి)గారి కుమార్తె స్వప్న (సుజాత) వారి ఇల్లు వెతుక్కుంటూ వెళ్లిన రాముకి దారిలో ఒకాయన కారుతో తిప్పలుపడుతూ కనిపించాడు.

"ఏమిటి, సార్? ఏమయింది?" అడిగాడు రాము.

"తెలిస్తే, నేనే స్టార్ట్ చేసుకునేవాడ్నిగా?" అన్నాడా వ్యక్తి.

"బండి కొత్తదిగా ఉంది దీనికేం ట్రబుల్, సార్?"

"ఈమధ్య ట్రబుల్సన్నీ కొత్తబళ్ళకేనయ్యా.. నువ్వేంటి – మెకానిక్వా?"

"కాదు; డాక్టర్ని."

"డాక్టర్‌కి కారు గురించి ఏం తెలుస్తుందయ్యా?"

"వెరీ సింపుల్... మనిషికి జబ్బొస్తే మంచమెక్కుతాడు. కారుకు జబ్బొస్తే, ఆగిపోద్ది. కాని, దీనికి మాత్రం ఏ ట్రబులూ లేదు, సార్!"

"అంటే, నేనేవన్నా ఫూల్ అనుకున్నావా?"

"అవునండి.. ఆహాఁ ఇందులో పెట్రోల్ లేదండి చూడండి – స్పేరుందా?"

"ఉంది."

ఇద్దరూ పెట్రోలు పోశారు.

"భలే కనిపెట్టేశావే! ఇదంతా నీకెలా తెలుసు? మనిషి జబ్బు నయంచేసే డాక్టర్ని చూశానుగాని, కార్ల జబ్బు కూడా నయంచేసే డాక్టర్‌ని నిన్నే చూశాను... ఊఁ.. నువ్వెక్కడికెళ్లాలి?"

"సెవ్వా రోడ్."

"నేనూ ఆ రోడ్‌కేనయ్యా ఎవరింటికెళ్లాలి?"

"నెంబర్ 3 – రావుగారింటికి"

"రావుగారింటికా? నేనూ ఆయనింటికేనయ్యా ఏం పని?"

"వారి పిల్లలకు ట్యూషన్ చెప్పడానికి"

"నేనూ అందుకేనయ్యా"

"అయితే, ఇక నేనెందుకండి?"

"అహోఁ.. ట్యూషన్ చెప్పడానిక్కాదు – ట్యూషన్ చెప్పడానిక్కాదు ఊరికే పిల్లల్ని చూడ్డానికి వెళ్తున్నాను"

ఆ కారులో కూర్చున్న రాముకు ఆ వ్యక్తే రావుగారని తెలియదు

దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో కె. నరసింహానాయుడు సమర్పించే యువ చిత్రవారి "గోరింటాకు" వన్నెల చిత్రానికి కె. మురారి నిర్మాత.



'ఇంటి భాగోతం'లో
డాక్టర్ టి. కృష్ణకుమారి




సురేష్ మూవీస్

# మండే గుండెలు

ఈస్ట్మన్ కలర్

nvkr

నిర్మాత డి.రామానాయుడు దర్శకత్వం కె.బాపయ్య

కథ గుహనాథన్ మాటలు జంధ్యాల పాటలు ఆచార్య ఆత్రేయ సంగీతం కె.వి.మహదేవన్ కళ జి.వి.సుబ్బారావు కూర్పు రవి

కోస్తా ఆంధ్ర
లక్ష్మీచిత్ర

నైజాం
విజయా సురేష్ పిక్చర్స్

సీడెడ్ నవభారత్ ఫిలింస్



← 'సన్నాయి అప్పన్న'లో జయప్రద, శోభన్‌బాబు

## సినిమా

## ఔట్‌డోర్ షూటింగ్‌లు

రాజలక్ష్మి సినీ ఆర్ట్ క్రియేషన్స్ బాపు దర్శకత్వంలో అంగర సత్యం నిర్మించే "కలియుగ రావణాసురుడు" వన్నెల చిత్రం ద్రాక్షారామం, వేగాయమ్మపేట, దొడ్డంపేట, వెల్ల గ్రామాలలో, కోటిపల్లి రేవులో జరిగింది శ్రీధర్, మురళీ మోహన్, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, శారద, అల్లురామలింగయ్య, భీమరాజు ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు రెండవ షెడ్యూల్ అక్టోబర్ 16 నుంచి 31 వరకు మారేడుపల్లి అడవిలో జరగడంతో షూటింగ్ పూర్తవుతుంది

పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్ "శంకరాభరణం" వన్నెల చిత్రం తొలి షెడ్యూల్ రాజమండ్రి పరిసర ప్రాంతాలలో జరిగింది ఈ చిత్రం ద్వారా పరిచయం గావింపబడే రాజ్యలక్ష్మి అనే కొత్త నటి వెనువెంటనే మరో ఆరు చిత్రాల్లో బుక్ కావడం ఒక విశేషం చంద్రమోహన్ హీరో కె విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఏడిద నాగేశ్వరరావు, ఆకాశం శ్రీరాములు ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు

శ్రీ శక్తి చిత్ర గుండా సత్యనారాయణ సమర్పించే "బడాయి బసవయ్య" వన్నెల చిత్రం షూటింగ్ ఏలేశ్వరం, ద్రాక్షారామం, కడియం, పింజలకోన, రాజమండ్రి, ధవళేశ్వరంలో జరిగింది గౌతమబుద్ధుడుగా విజయచందర్ పాల్గొనే రూపకాన్ని హైదరాబాద్‌లో చిత్రీకరిస్తారు రంగనాథ్, చంద్రమోహన్, నూతన్ ప్రసాద్, నారాయణరావు, పి ఎల్ నారాయణ, గోకిన రామారావు, సంగీత, కవిత, జయమాలిని, పి ఆర్ వరలక్ష్మి ముఖ్య తారాగణం బోయిన సుబ్బారావు దర్శకత్వంలో వి ఎస్ ప్రకాశరావు, బి సోమేశ్ నిర్మాతలు

అనంతలక్ష్మి ఇంటర్నేషనల్ "దశ తిరిగింది" వన్నెల చిత్రాన్ని కట్టా సుబ్బారావు దర్శకత్వంలో దగ్గుబాటి భాస్కరరావు కారంచేడులో నిర్మిస్తున్నారు మురళీమోహన్, చంద్రమోహన్, దీప, జ్యోతి, పి ఎల్ నారాయణ, నూతన్ ప్రసాద్ వగైరా నటవర్గం

త్రిమూర్తి ప్రొడక్షన్స్ 6వ చిత్రం పతాక సన్నివేశాలు, కొన్ని పాటలు ఊటీలో చిత్రీకరింపబడుతాయి కృష్ణ, శ్రీదేవి నాయకా నాయికలు కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో పి బాబ్జి, జి సాంబశివరావు నిర్మాతలు

శ్రీ వాణీ వరలక్ష్మి కంబైన్స్ పోలవరపు బ్రహ్మానందరావు దర్శకత్వంలో ఎన్ వి సుబ్బరాజు సమర్పించే "రతీమన్మథ" చిత్రం షూటింగ్ హార్స్లీహిల్స్‌లో జరిగింది రాజ్యలక్ష్మి, గోపీకృష్ణ నాయికా నాయకులు కె వి రమణమూర్తి రచయిత



← 'మావూరి దేవత'లో ప్రభ, రంగనాథ్



'శివమెత్తిన సత్యం'లో కృష్ణంరాజు, శారద

# సినిమా

రంజిత్ ఆర్ట్స్ దోసకాయలపల్లి గ్రామంలో ప్రారంభమైన ''తొలి కోడి కూసింది'' వన్నెల చిత్రం షూటింగ్ రాజమండ్రికి పదహారు మైళ్ళ దూరంలోని పురుషోత్తమపట్నం వద్ద కొండల మధ్య వున్న పెద్ద సరస్సులో జరిగింది కె బాలచందర్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కానూరి రంజిత్‌కుమార్ నిర్మాత సీమ, శరత్ బాబు, మాధవి, నగ్నసత్యం సుబ్బారావు, సరిత, ప్రసాద్‌బాబు, శాంతారామ్, రమణమూర్తి, ధూళిపాళ, సత్తిబాబు, కొత్త నటుడు జీవా పాల్గొంటున్నారు గణేశ్‌పాత్రో మాటలు, ఆత్రేయ పాటలు రాశారు

శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ విజయ బాపినీడు నేతృత్వంలో ''బొట్టు – కాటుక'' చిత్రం చాటపర్రు గ్రామంలో పూర్తయింది మురళీమోహన్, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, జయంతి, మాధవి, నిర్మల ముఖ్య పాత్రధారులు

మాగంటి రవీంద్రనాథ్‌చౌదరి నిర్మాత దుర్గా నాగేశ్వరరావు దర్శకుడు

భరణి పిక్చర్స్ భానుమతీ రామకృష్ణ దర్శకత్వంలో ఆమెతోపాటు రాజీ, చక్రపాణి, శరత్‌బాబు, రమాప్రభ మున్నగువారు పాల్గొనే ''రచయిత్రి'' వన్నెల చిత్రం షూటింగ్ గూడూరు సమీపాన పూర్తయింది అక్టోబర్ విడుదల

తెలుగు చిత్ర విజయవాడ పరిసర ప్రాంతాలలో పూర్తిగా ఔట్‌డోర్‌లో తయారైన ''నీడ'' ప్రయోగాత్మక చిత్రాన్ని దాసరి నారాయణ రావు స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో రామినేని నిర్మించారు విజయకుమార్, జానకి, వైజయంతి, చి|| రమేష్‌కృష్ణ పాల్గొన్నారు

చిన్ని ఇంటర్నేషనల్ నిర్మాత, ఛాయా గ్రాహకుడు, కె ఆర్ వి భక్త దర్శకత్వంలో ''అందాలరాశి'' వన్నెల చిత్రం షూటింగ్ వెల్నూరు, పెంచలకోన, దుర్గమిట్ట, కైకలూరు ప్రాంతాల్లో జరిగింది రతి, రాజ్‌కుమార్ నాయికా నాయకులు

మీనాక్షి ఫిలిమ్స్ భానుమతీ రామకృష్ణ దర్శకత్వంలో ఆమెతోపాటు రాజ్, గీత, చక్రపాణి, శరత్‌బాబు పాల్గొన్న ''ఒకనాటి రాత్రి'' వన్నెల చిత్రం చివరి షెడ్యూల్ కూడా గూడూరు ప్రాంతంలో జరిగింది

సత్యసాయి ప్రొడక్షన్స్ ఎన్ టి ఆర్, లత నాయకా నాయికలుగా కె శంకర్ దర్శకత్వంలో ''శృంగారరాముడు'' వన్నెల చిత్రం షూటింగ్ కాశ్మీర్, ఊటీలలో జరిగింది

ఎస్ వి ఎస్. ఫిలిమ్స్ విజయనిర్మల దర్శకత్వంలో కృష్ణ, జయప్రద, లతతో మిద్దె సోదరులు నిర్మించే ''శంఖుతీర్థం'' వన్నెల చిత్రం షూటింగ్ తిరుత్తణి, శ్రీ పెరుంబుదూరు ప్రాంతాలలో జరిగింది

సువర్ణభారతి ఆర్ట్ ప్రొడక్షన్స్ ''రారా కృష్ణయ్య'' వన్నెల చిత్రం తణుకు దగ్గర ఉండ్రాజవరంలో చిత్రీకరింపబడింది చంద్ర మోహన్, మాధవి నాయకా నాయికలు యోగి దర్శకత్వంలో కొత్తా సాంబశివరావు, అనుమాల బాలాజీ చంద్రశేఖర్ నిర్మాతలు

దేవర్ ఫిలిమ్స్ రజనీకాంత్, శ్రీప్రియ, మోహన్‌బాబు, నాగభూషణం, అల్లురామలింగయ్య, కె వి చలం, అంజలీదేవి, జయమాలిని, రమాప్రభ పాల్గొన్న ''అమ్మ ఎవరికైనా అమ్మ'' వన్నెల చిత్రం షూటింగ్ మదుమలై అడవుల్లో పూర్తయింది వేదారణ్యంలో హార్స్ ఫేసింగ్స్‌ను అద్భుతంగా చిత్రీకరించారు డైరెక్టర్ ఆర్ త్యాగరాజన్ ఏనుగు మద్యం సేవించి, క్లబ్‌లో నాట్యం చేయడం ఒక హైలైట్ దండాయుధపాణి నిర్మాత రావుల అంకయ్యగౌడ్ నెగటివ్ రైట్స్ హోల్డర్

శ్రీ కాంతి ప్రొడక్షన్స్ ''క్రాంతి'' సందేశాత్మక చిత్రాన్ని పూర్తిగా ఆంధ్రప్రదేశ్‌లో చల్లా ఈశ్వరయ్య, కె ఎం ఎస్ భాస్కరరావు నిర్మించారు జయంతి, రంగనాథ్ నాయికా నాయకులు మంజులూరి భీమేశ్వరరావు కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో పుంటుకూరి సత్యనారాయణ ఈ చిత్రాన్ని సమర్పిస్తున్నారు

రామకృష్ణ ఫిలిమ్స్ ''మా ఊరి దేవత'' వన్నెల చిత్రం రాజమండ్రికి 30 మైళ్ళ దూరంలో ఉన్న దంగేరు గ్రామంలో తయారైంది రంగనాథ్, ప్రభ నాయకా నాయికలు గిరిధర్ దర్శకత్వంలో మొలకల సుబ్బరామిరెడ్డి, ఎం ప్రభావతమ్మ ఈ చిత్ర నిర్మాతలు సమర్పణ ఎం రామకృష్ణారెడ్డి

సామ్య సినీ ఆర్ట్స్ చెరుకూరి జనార్దనరావు సమర్పించే ''జాతర'' వన్నెల చిత్రం విజయవాడ పరిసరాలలో తయారైంది శ్రీధర్, చిరంజీవి, జయలక్ష్మి, నాగభూషణం, పి ఎల్ నారాయణ ప్రభృత నటవర్గం ధవళ సత్యం దర్శకత్వంలో ఆర్ ఎన్ రామరాజు నిర్మాత



# దివ్యమైన తెలుపుకు
# ఒకే దారి

క్రొత్త ఫార్ములా

# డెట్

డిటర్జెంట్ ఉతికే పౌడర్




సాటిలేని ఉతుకు శక్తి,
అదనపు నురుగు,
తాజా సువాసన మరియు
దివ్యమైన తెలుపు!

**దివ్యమైన తెలుపు,**
**డెట్ యొక్క తెలుపు**

Shilpi DM 52/7

( గత సంచిక తరువాయి )


కర్ణుడు కవచ కుండలములనొక్కటొక్కటే శరీరమునుండి ఛేదించి మాయా విప్ర వేషధారియగు మహేంద్రునకిచ్చెను.


కర్ణా! నీ సాహసానికే మెచ్చి ఇస్తున్నాను - ఇది శక్తి ఆయుధము. నీ ద్వారా ఒక్కని సంహరిస్తుంది. స్వీకరింపుము......


జనమేజయ రాజా! అలా కవచ కుండలముల హరించి వాని దానగుణంబునకు మెచ్చి తన శక్తి ఆయుధము నిచ్చి, కవచ హీనంబై వికృతంబుగా నున్న కర్ణుని శరీరంబు అరుణ కిరణ వర్ణంబైన దీప్తిం జెలువొందునట్లుల వరమిచ్చి అదృశ్యుడయ్యెనింద్రుడు.......
.... ఇటు పాండవులు కామ్యకవనము నుండి కదలి ద్వైతవనంబునకు వచ్చి కాలక్షేపము చేయుచుండగ ఒక విప్రుడు వచ్చి.........


ధర్మరాజా! ప్రణామములు. నా అరణిని ఒక చెట్టు కొమ్మకు తగిల్చితిని. ఒక జింక ఆ చెట్టును రాచుకొను చుండగ అరణి దాని కొమ్ముకు తగుల్కొనినది. దానితో మృగము పారిపోయినది. దయయుంచి నాకు నిత్యవిధి లోపం జరుగకుండా నా అరణిని తెచ్చి పెట్టు ముని ప్రార్థన...........




ధర్మరాజాదులు బ్రాహ్మణుని అరణిని దెచ్చుటకు మృగమును వెంబడించి, ఘోరాటవిలో ప్రవేశించిరి.... చెంగు చెంగున గెంతుచు ఆ మృగము అరణ్య మధ్యమున అదృశ్యమైనది... పాండవులు మృగాన్వేషణలో అలసిపోయి ఒక చెట్టు క్రిందకు విశ్రమింప వచ్చిరి..............


నకులా! బాగా దాహంగా ఉందయ్యా. ఈ చెట్టు ఎక్కి జలమున్నతావేదైన కనిపిస్తున్నదేమో చూడు




కొంచెము దూరములో చిన్న సరోవర మున్నది అన్నయ్యా!
అటులయిన నీవు వెళ్ళి దాహం తీర్చుకొని మాకు కూడా నీరు తెచ్చిపెట్టు.
[ ఇంకా ఉంది ]

ఈశ్వరీ చిత్ర రంగనాథ్, శరత్‌బాబు, ఈశ్వరరావు, లత, కవిత, రమాప్రభలతో "కాళరాత్రి" వన్నెల చిత్రం హార్స్‌లీ హిల్స్‌లో నిర్మించబడింది పి చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి బలరామరెడ్డి, రెడ్డిశేఖర్ నిర్మాతలు శీశెట్టి లక్ష్మణరావు సంభాషణలకర్త

శ్రీ స్వామి అయ్యప్ప ఫిల్మ్స్ - "మంగళ గౌరి" వన్నెల చిత్రం రాజమండ్రి పరిసరాలు, మండపేట, రావులపాలెం, కోనసీమలోని బోడసకుర్రు రేవులవద్ద చిత్రీకరింపబడింది శారద, మురళీమోహన్ నాయికా నాయకులు గిరిధర్ దర్శకత్వంలో వాసిరెడ్డి నాగేశ్వరరావు, ఎం నరసింహారావు నిర్మాతలు

శ్రీ శారదా ఇంటర్నేషనల్ · "అగ్ని సంస్కారం" చిత్రం ఆదిలాబాద్, షాహపూర్, తడ ప్రాంతాలలో చిత్రీకరింపబడింది చిరంజీవి, లక్ష్మీకాంత్, రమణమూర్తి, రూప, భావన నటించారు జి వి ప్రభాకర్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి రమాదేవి, జి వసుమతీదేవి నిర్మించారు

ఎం ఆర్ కంబైన్స్ "బ్రహ్మంగారి కథ" వన్నెల చిత్రానికి కథకుడు, నిర్మాత, దర్శకుడు కుమార్ నందికొండ, పాపాగ్నిమఠం ప్రాంతాలలో చిత్రీకరింపబడింది ఊర్మిళ, మోహనకృష్ణ నాయికా నాయకులు

బి వి ఆర్ ప్రొడక్షన్స్ టి మాధవరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో "పారిజాతం" చిత్రం కడప, హైదరాబాద్‌లో చిత్రీకరింపబడింది లలిత, రాంబాబు, శశిరేఖ, శశాంక్, రాజేశ్వరి నటించారు బి సి రెడ్డయ్య సమర్పణలో బి పార్వతమ్మ నిర్మాత

విజయ రాజేశ్వరీ ప్రొడక్షన్స్ "మానవులు--మమతలు" వన్నెల చిత్రంలో ఈశ్వరరావు, పాలం ప్రధాన పాత్రధారులు తడ ప్రాంతంలో తయారైంది చంద్ర, శ్రీనివాస్ దర్శకులు కె బాల అంకిరెడ్డి నిర్మాత

శ్రీ చేతనా చిత్ర ఛాయాగ్రాహకుడు పి దేవరాజ్ సమర్పించే "మన ఊరి మారుతి" వన్నెల చిత్రంలో ప్రభ, మురళీమోహన్ నాయికా నాయకులు పి శేఖర్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి శ్రీనివాసరావు, బంగారు వీరభద్రం నిర్మాతలు

విజయప్రభ మూవీస్ పశ్చిమ గోదావరి జిల్లాలోని ఆచంట, నెల్లూరు జిల్లాలోని బాపిరెడ్డి పాలెం ప్రాంతంలో తయారైన "మున్నబుగారి అల్లుడు" చిత్రాన్ని ఎస్ డి విజయ్‌బాబు కథ, స్క్రీన్‌ప్లే, సంభాషణలు, దర్శకత్వంలో లక్ష్మి విజయ్‌బాబు నిర్మించారు గిరిబాబు, త్యాగరాజు, శ్రీ గీత, వాణీచంద్ర పాత్రధారులు

కౌముది ఎం ఎస్ రెడ్డి సమర్పించే 'అందగాడు" వన్నెల చిత్రంలోని కొన్ని సన్నివేశాలు ఊటీలో చిత్రీకరింపబడ్డాయి కమలహాసన్, శ్రీదేవి, సీమ ముఖ్య భూమికలు నిర్వహించారు టి ఎన్ బాలు, కమలహాసన్ దర్శకులు

శ్రీ వాసవీ ప్రొడక్షన్స్ నెల్లూరు సమీపాన విడవలూరులో "సమాధి కడుతున్నాం — చందాలివ్వండి" వన్నెల చిత్రం షూటింగ్ జరిగింది నూతన్‌ప్రసాద్, నాగభూషణం, శివకుమార్, పి ఎల్ నారాయణ, కె విజయ, చిట్టిబాబు, జయమాలిని, నిర్మల వగైరా నటవర్గం గూనా నాగేంద్రప్రసాద్ దర్శకత్వంలో నూలి రంగయ్య, పులిపాటి వెంకటేశ్వర్లు నిర్మించారు ★



## ఇరుగు - పొరుగు

★ "గోధూళి" అనే హిందీ చిత్రంలో ముస్లిమ్ యువకుడు నాసిరుద్దీన్‌షా పిలక పెట్టుకొని ఒక గుడిలో అర్చకుని పాత్రను అతి సహజంగా పోషించాడు

★ 'ఎర్రగులాబీలు" చిత్రాన్ని రవికుమార్ హిందీలో తీయదలచి, రాజేష్‌ఖన్నాకు మొదట ఆ కథ చెప్పాడు కాని, నాయకుని పాత్ర రాజేష్‌కు నచ్చలేదు ఆ తర్వాత రాజేష్ ఏదో పని మీద మద్రాసుకు వచ్చినప్పుడు నిర్మాత రవికుమార్ కూడా మద్రాసుకు వచ్చాడు "మీకా తమిళ చిత్రాన్ని ప్రత్యేకంగా చూపించను థియేటర్లో ప్రేక్షకులతో పాటు కూర్చొని చూస్తే, మీకు తప్పకుండా నచ్చుతుంది," అన్నాడు రవికుమార్ అలాగే రాజేష్ ఓ థియేటర్‌లో కూర్చొని చూశాడు. ఆ చిత్రంలో హీరో హత్య చేసినప్పుడల్లా ప్రేక్షకులు కరఘోష చేయడంతో చకితుడయ్యాడు రేప్‌లు, హత్యలు వున్న ఆ చిత్రాన్ని ఎక్కువగా మహిళలు (ప్రేక్షకులలో 70 శాతం) చూడడం అతనికి మరింత విభ్రాంతి కలిగించింది సినిమా అయ్యాక ఆ మహిళల్లో చాలామంది చెమ్మగిల్లిన కళ్ళతో బయటకు రావడం చూశాడు అక్కడే నిర్మాత రవికుమార్‌తో "ఓ—కే ఈ చిత్రంలో నటిస్తాను," అని అంగీకరించాడట

★ జయమాలిని ఇంటి ముందు 'జయమాలిని అండ్ కో' అనే బోర్డు వుంది అలాంటి పెద్ద బోర్డు వున్న తార ఆమె ఒక్కతే !

★ సుజాత, సంగీతలకు సిగరెట్ పొగ అంటే గిట్టదు అంచేత వాళ్ళ ఇళ్ళల్లోని విజిటర్స్ రూమ్‌లో యాష్‌ట్రేను ఎక్కడా వుంచరు "వచ్చినవారు ఇక్కడున్నంతసేపైనా సిగరెట్ తాగకుండా వుంటే వారి ఆరోగ్యానికి ఎంతో మంచిది," అంటుంది సంగీత "మావారికి సిగరెట్ అలవాటుంది ఐతే, వారి ఆఫీసు గదిలో మాత్రమే సేవిస్తారు ఆయన ఆడిటర్ కదా ? ఎన్నో అక్కౌంట్లు తనిఖీ చేయాలిమరి కాస్త చురుకుదనం అవసరంగా ? అంచేత అప్పుడు మాత్రమే అనుమతించాము," అంది సుజాత

★ తన చెల్లెలు కల్యాణి సినిమాలలో నటించడానికి ఒకప్పుడు అంగీకరించని సత్యప్రియ ఇప్పుడు తన చెల్లెలిని ఒక చిత్రంలో నటింపజేస్తోంది ఆమె భర్తే హీరో, నిర్మాతానూ సత్యప్రియ డైరెక్టరు ఈ చిత్రం కన్నడంలో తయారౌతుంది

### "కస్తూరి తిలకం"

నరేష్‌కుమార్ క్రియేషన్స్ పతాకంలో ఎ వి ఎమ్ మురుగన్ సమర్పించే "కస్తూరి తిలకం" వన్నెల చిత్రంలో శారద, రంగనాథ్ నాయికా నాయకులు ఎ వేణుగోపాల్ రచయిత సత్యం సంగీత దర్శకుడు సుఖదేవ్ ఛాయాగ్రాహకుడు అక్టోబర్ 10 నుంచి 18 వరకు హైదరాబాద్‌లో తొలి షెడ్యూల్ జరిగే ఈ చిత్రాన్ని టి ఎస్ రామారావు చిత్రానువాదం, దర్శకత్వంలో పి తులసీదేవి నిర్మిస్తారు ✪


"మంగళతోరణాలు" ఒక దృశ్యం

సంఘజీవులం ఘనం సంఘం కొరకు కొన్ని పనులు చేయాలి! మన సంగతి వారికి కావాలి

రామునితో ఇష్టంగా వనవాసం చేస్తూ ఆయన సపర్యలోనే ఆనందం వెతుక్కున్న సీతను, ఆమె తప్పు ఇంతకూడా లేదని తెలిసిన రాముడు సీతను పరులకోసం, సంఘమర్యాదకోసం బహిష్కరించాడు

అలాటి సంఘంలో వున్న తనకు ఎలాటి శిక్ష, ఎలాటి న్యాయం జరిపిస్తారు! తానెవ్వరికి భార్య! మనస్సు దోచుకున్నవారికా? శరీరం పంచుకున్న వారికా?

కొత్త సమస్య! తీర్చేవారెవ్వరు?

పాపను మోహన్ తీసుకుంటాడు అజయ్ తన బిడ్డను వదలుకుంటాడా?

ప్రియ లేకుండా తను బ్రతుకగలదా? ఇప్పటికే మనస్సు, హృదయం తన బిడ్డల కోసం అలమటించిపోతున్నాయి

మోహన్‌ని చూడకుండా బాబు వుండలేడు బాబు నిద్రపోడు అన్నం తినడు వాడి చిన్నారి హృదయం గాయమవుతుంది వాడు బ్రతుకడు

అజయ్ కుళ్ళి, కుళ్ళి ఏడుస్తున్న నళినిని చూశాడు నళిని కంటనీరు పెడితే తను చూడలేడు అలా ఏడుస్తూ వుంటే చూస్తూ బ్రతుకలేడు

అజయ్ మోహన్ ఇంటికి వెళ్ళాడు మోహన్ కారు కదలబోతూంది కారు కెదురుగా నిల్చున్నాడు అజయ్ కారులో నుంచి తీక్షణంగా అజయ్ వైపు చూశాడు మోహన్ అతను ఎందుకు వచ్చాడో గ్రహించాడు

# నళిని

[ 28వ పేజీ తరువాయి]

బాబును లాక్కుపోతాడు పెద్దవాళ్ళ పాపాలకి ఫలితం అశుభం శుభం తెలియని పసివాడు అనుభవిస్తాడు ఇదెక్కడి న్యాయం! భగవంతుడా! అతని హృదయం భగవంతునిపై భగ్గుమంది

అంతవరకు 'నాన్నా' అంటూ ప్రయాణానికి అతి వుత్సాహంగావున్న బాబు ఎదురుగావున్న అజయ్‌ను చూశాడు ఆ కుంటివాడు వచ్చిపోయిన అమ్మను ఎత్తుకుపోయాడు. భయంగా మోహన్ మెడను కావలించుకున్నాడు

"బాబు తను లేకుండా వుండలేడు వాడు లేకుండా తను వుండగలడా? చంచల అయిన ఆడది తనను మోసంచేసింది 'ఛా' అనుకున్నాడు డబ్బు ఇస్తే ఆడదాని అందం, శరీరం దొరుకుతాయి మనస్సు—ఆత్మను చేర్చి శరీరాన్ని అర్పించేది భార్య అలాటి భార్య ప్రేమను కోరాడు ఆత్మలేని శరీరం కట్టెతో సమానం అలాటి స్త్రీ తనకు అక్కరలేదు తను ఎంతగా ప్రేమించాడో అంత ప్రేమను పొందలేనివాడు తన జీవితం వ్యర్థం" అనుకున్నాడు మోహన్ హృదయాన్ని రాయి చేసుకున్నాడు

"నీకు కావలసింది, నీవు తీసుకుపోవచ్చు" అని అజయ్‌తో పళ్ళబిగువున ఇంగ్లీష్‌లో అన్నాడు

అజయ్ కారు దగ్గరకి వచ్చాడు వెనుక సీట్లో పసివాడి వళ్ళో వున్న ప్రియను చూశాడు కొత్త వ్యక్తి వైపు చురుకైన కళ్ళతో చూస్తూంది

పాప ముఖంలో బెంగ వుంది ప్రియ వైపు చేతులు చాపి "పాపా! అమ్మ నిన్ను తీసుకు రమ్మన్నది" అన్నాడు

పాప క్షణం తటపటాయించినా ఆ వెంటనే అజయ్ చేతుల్లోకి దూకింది

అమ్మ! అమ్మ! అన్న మాట విని ప్రియ ముఖం వికసించింది

పాపను అతి ప్రియంగ, ఇష్టంగా ఎత్తుకున్న అజయ్‌ను చూశాడు మోహన్

మోహన్ అజయ్‌లు దీర్ఘంగా ఒకరినొకరు చూసుకున్నారు చివరికి మోహన్ అన్నాడు

"ఆమెకు నేను డైవర్స్ ఇస్తున్నాను" అంటూ కారును ముందుకు పోనిచ్చాడు

అజయ్ సంతోషంగా, ప్రియను గుండెలకు హత్తుకున్నాడు

* * *

పూతకు వచ్చిన చీనీ చెట్ల నీడన సుఖాసీనులైన గౌరీశంకరులు అక్కడే ఆడుకుంటున్న ప్రియదర్శినిని కనిపెట్టుకుని వున్నారు

చీనీపూలు మధురమైన సువాసనలు వెదజల్లుతున్నాయి

చరిత్ర తిరగబడినా వారికి న్యాయం చేకూర్చింది ఎవరికివారు సంతోషంగా తృప్తిగా వున్నారు

వాసవి, మోహన్ రాకకై ఎదురుచూస్తూ వుంది

బాబుతో ఎప్పటికైన తిరిగి ఇంటికి రాక తప్పదుగా మరి!

*(అయిపోయింది)*







## తంజావూరు సత్రవ

అన్నదానం చేయటానికి కట్టించిన సత్రం అని అర్థం.

ఒకప్పుడు తంజావూరి ప్రజలు, మహా దాతలుగా పేరు ప్రఖ్యాతులు పొందారు. వారు సత్రవలెన్నో కట్టించారు. ఒక్కొక్క సత్రవలో ఒక్కొక్క రోజున్నా, నెలల తరుబడి గడపవచ్చు నంటారు

పదిహేడవ శతాబ్దంలో, తంజావూరుని పరిపాలించిన విజయ రాఘవరాజు ఒక సత్రం కట్టించారనీ, ఆ సత్రంలో, ప్రతిరోజూ, నూరు లక్షల ప్రజలకు షడ్రసోపేతంగా భోజనం పెట్టేవారనీ ప్రతీతి సత్రాలకు తంజావూరు ఆ వాడు అంత ప్రసిద్ధి కాబట్టి, యీ పలుకుబడి దానిపై వచ్చింది.

రాయల కాలంలో కూడ యిలాంటి సత్రాలుండేవి. ఆ సత్రాలు, సోమరులకు రాయలు కట్టించారు. ప్రతి సోమరికీ, తినటానికి తిండీ, ఉంటానికి చోటు. ఇంకేమి కావాలి. సత్రాలన్నీ నిండి పోయాయి. రాయలుకు వాళ్ళంతా నిజంగా సోమరులేనా, అనే అనుమానం వచ్చింది. సోమరులెవ్వరో తెల్సుకోవాలను కున్నాడు.

సత్రంకొకదానికి నిప్పెటించాడు. దానిలో ఉన్నవారు అందరూ, బ్రతికి బైటపడ టానికి, వీటుబడితే అటు పరుగెత్తారు. ఒక్కడు మాత్రం, తనకేమీ పట్టనట్టు,

## సామెతలకథలు

నిశ్చింతగా పడుకునే ఉన్నాడు. అప్పుడే కడుపారా తిని పడుకున్నాడు. మంటలు చూచి "యిప్పుడెవడు లెగుస్తాడు" అని అలాగే పడుకున్నాడు. అప్పుడు తెల్సింది ఎవరు సోమరులో ఎవరు గాదో రాయలకు.

మన ప్రభుత్వం కూడ, చదువుకున్న నిరుద్యోగులకు, ఉద్యోగస్తులకు నెల నెలా జీతాలిచ్చేటు, ఆర్థిక సహాయం చేయాలను కుంటూంది. ఎవరు నిరుద్యోగులో తెల్సుకో టానికి "రాయలు కమిషనో, కమిటియో" అవసరమేమో!

– పద్మావతి గంగాధర్

## గప్ చిప్ రైలు

పశ్చిమ జర్మనిలో ఒక "అంతర్జాతీయ ట్రాన్సుపోరు" ప్రదర్శనలో పెట్టిన 'హోవర్ ట్రైను' ప్రజలను విశేషంగా ఆకర్షించింది. ప్రదర్శన కోసం ఏర్పాటు చేసిన పట్టాలపై గంటకు 100 కి. మీ. వేగంతో నిశ్శబ్దంగా నడిచింది. పొడవైన రైలు మార్గాలపై దీని వేగం గంటకు 400కి.మీ. వరకు ఉంటుంది. కాని చప్పుడు చేయదు.

**టి. వి. పి. — గుంటూరు**

నాకు ప్రతిపూట భోజనము చేసేటప్పుడు ముక్కునుండి నీరు కారుతుంది. మొదట్లో కారం తింటే అలా వస్తుందనుకున్నాను కాని మజ్జిగన్నం తిన్నా అలాగే వస్తుంది. దీనికి కారణము ఏమిటి

భోజన కాలంలోనూ, భోజనానంతరము ఇలా ఏర్పడటం సహజం. వేడి,వేడిగా తొందరగా, ఆదుర్దాగా భోజనం చేస్తే చాల మందిలో ఇది ఒకటి. దీనిని గస్టేటరీ హైపర్ సెక్రెటింగ్ అంటాము రుచి వలన ఏర్పడే ఎక్కువ నీటి ఉత్పత్తి అని అర్థం. ఈ స్థితి ఉత్పత్తి ముక్కులో జరిగితే దానిని ముక్కు కారటం అంటాము. ఈ ముక్కులో కారటానికి ఆహారపదార్థాలకి ఏమీ సంబంధము లేదు. ప్రత్యేకంగా దీనికి వైద్యము లేదు.

**విన్. ఎస్ ఆర్. — గోపాలపురం**

నాకు మెడక్రింద కంఠముదగ్గర ఎడమవైపు కొంచెము ఎత్తుగా వాయిలా 4నెలల నుండి వున్నది. డాక్టరుకిచూపిస్తే 2 నెలల వరకూ ఏమందూ ఇవ్వకుండా ప్రతివారము పరీక్షించేవారు. థైరాయిడ్ గ్రంథి అన్నారు. థైరాయిడ్ గ్రంథి అంటే ఏమిటి? ఇది మనిషికి ప్రమాదమా? ఆపరేషన్ లేకుండా పోయే మార్గములేదా ఆపరేషన్ చేయించుకొంటే ఏమైనా ప్రమాదమా

థైరాయిడ్ గ్రంథి అంటే మన శరీరంలో ఉన్న కొన్ని ముఖ్యమైన నాళములులేని [వాటిచర్య వల్ల ఉత్పత్తి అయ్యే పదార్థాలు సరాసరి రక్తంలో కలవటం అంటే ఏ నాళముల సహాయం లేకుండానే] గ్రంథులలో ఒకటి.దీని మాత్రమే చెప్పవలసి వస్తుంది. ఈ గ్రంథి ఎక్కువగా పనిచేసినా, తక్కువగా పని చేసిన మనిషిలో కొన్ని మార్పులు వస్తాయి ఆపరేషన్ అవసరం అయ్యేదీ, లేనిదీ రోగాన్నిబట్టి వుంటుంది. ప్రమాదమనేది లేదని డాక్టర్లు చెప్పిందే నిజం!

**విమ్. వి. — తెనాలి**

నా వయస్సు 34 సంవత్సరములు. ఒక సంవత్సరమునా నాకు ఎడమభాగమంతా చాలా వీక్‌గా వుంటోంది. అలా వున్నప్పుడు ఇంజక్షన్లు వాడినాను. కొన్ని రోజులు బాగుండి మరలా వస్తోంది. పాదము మొదలు నడుము, మెడ వరకు, తల వీకుగా పట్టి నొప్పిగా వుంటుంది.

ఈ లక్షణాలు వున్నవారు న్యూరోఫిజిషియన్ల సహాయం పొందటం అవసరం. ఈలోగా నెత్తురులో వి డి. ఆర్. ఎల్. పరీక్ష, యూరిన్ పరీక్ష మొదలైనవి చేయించుకొని వాటి ఫలితాలను వారికి చూపించితే మంచిది తరచు బ్లడ్ ప్రెషర్ చూపించుకోవటం దానిని ఒకకాగితంలో తేదీ వారీగా వ్రాసుకోవటం మంచిది.

**పి. విస్. — అంబాజీపేట**

మావారి వయసు 28 సంవత్సరములు. వివాహమై 2 సంవత్సరములైనది. వారికి కొంచెము పొట్ట వచ్చినది. పొట్ట వచ్చినవాళ్లు బంగాళదుంపలు, చిలకడదుంపలు తినకూడదని అంటున్నారు. పొట్ట వచ్చినవాళ్ళు ఏమేమితినకూడదో తెల్పండి.




పొట్ట రావటానికి వాటికి ఏమీ సంబంధము లేదు. పొట్టరావటానికి కడుపుమీది కండరాల పటుత్వం తగ్గటం, కడుపులోపల భాగంలో క్రొవ్వుపదార్థం చేరటం కొన్ని కారణాలు

దుంపకూరలు పిండిపదార్థాలను మాత్రమే ఎక్కువ కలిగి వుంటాయి. కాని శరీరంలోని కాలరీలలో ఈ పిండిపదార్థాలను క్రొవ్వుగా మార్చే అవకాశం వున్నది. నూనె, నెయ్యి, తగ్గించి రోజూ రెండుపూటల రెండుమైళ్ళునడిచి, ఆహారం పరిమాణం తగ్గిస్తే పొట్టదానంతటదే తగ్గుతుంది.

**విమ్. వి. ఆర్. — చిత్తూరు**

మా అమ్మాయి వయస్సు 15 సంవత్సరములు. దానికి చిన్నతనము నుండి కాళ్ళు, చేతులు బిరుసుగా వుంటున్నవి. చర్మం పైన గీతా లగాను, గరుకుగాను వుండి తెల్లగా పొలుసు లేస్తూ వుంటుంది. వాసెలిన్ మర్దన చేసిన తరువాత తగ్గి మళ్ళీ రెండురోజులలో యధాస్థితికి వస్తుంది.

చర్మం నున్నగా వుండటానికి, తగినంత మెరుపు కలిగి వుండటానికి కొన్ని అమైనోయాసిడ్ లు [ప్రోటీన్లు శరీరంలో జీర్ణమైన తర్వాత ఏర్పడేవి] విటమిన్ ఎ,డి లు చాలా అవశ్యం. క్రొవ్వుపదార్థాలు తగినంతగా వాడకపోవటం లేక మితిమించి ఎక్కువగా వాడటంవల్ల చర్మం తన సహజస్థితిని పోగొట్టుకోవటానికి ముఖ్య కారణాలు

పై విషయాలు దృష్ట్యా ఆహార విధానములలో మార్పులు, విటమిన్ ఎ మాత్రలు లేక కాప్స్యూల్స్ వాడితే తగిన ఫలితం కనిపిస్తుంది.

**జె. వీన్. ఆర్. — కర్నూలు**

మా అమ్మాయి వయస్సు 18 సంవత్సరములు. 1 సంవత్సరము నుండి బలపములు, విభూతి, మట్టి మొదలైనవి తినటం అలవాటయినది. ఇది ఆరోగ్యానికి చెడా?

పెర్వర్టెడ అప్పెటైట్ అనే ఆహారవిధానాలలో కలిగే వ్యక్తిగత అసహజత్వాను, కొందరికి వయస్సు మీరిన తర్వాత రోగిని, ఎక్కువగా ఈ రోగం చిన్నపిల్లలలో కనిపిస్తుంది.

గర్భిణీస్త్రీలు ఇలా చెయ్యటం సహజం. కానీ మామూలు వ్యక్తులలో అంటే యుక్త వయస్కులలో ఈఅలవాటు చాలా అసాధారణం. ఈ అలవాటు వీరిలో ఎక్కువకాలంగా వుండటం వీరిలోని మానసిక ప్రవృత్తిని మాత్రమే తెలియజేస్తుంది. మానసిక కొన్ని విధాల అనుభూతులు, కోరికలు తీరనప్పుడు ఈ విధంగా జరిగే అవకాశం వున్నది. ఆరోగ్యం పాడవటం అనేది తినే పదార్థాన్ని బట్టి, తినబడిన ప్రమాణాన్ని బట్టి వుంటుంది మట్టి మొదలయినవి తినటం వల్ల దేహానికి చాలా హాని కలుగుతుంది.

**వి. ఎఫ్. ఎ. ఆర్. ఎ — చిత్తూరు**

మాకు ఏడవనెలలో పిల్లవాడు పుట్టినాడు. ఆ పిల్లవాడిని గురించి తీసుకోవలసిన జాగ్రత్తలు తెల్పండి.

7వ నెలలోపుట్టిన పిల్లలని ప్రిమెచూర్‌బేబీ అంటారు. వారి బరువు 2.5 కేజీలకు తక్కువ వుంటుంది. ఇలా బరువు తక్కువగా పుట్టిన పిల్లలకు వైద్య సహాయము కన్నా సరైన పర్యవేక్షణ అవసరం. సరైనదంటే బురఖా వంటి యూనిఫాం వేసుకున్న వారేనాడు. పుట్టినప్పటి దగ్గర నుండి తగిన పరిమాణంలో పాలుపట్టటం, శరీరఉష్ణోగ్రత గమనించటం, ఆహారం మ్రింగలేని శిశువులకు ముక్కుద్వారా గొట్టం పోనిచ్చి పాలు ఇవ్వటంమొదలయిన సపర్యలు చేయించటం చాలా అవసరం. ఈ జాగ్రత్తలన్నీ శిశువు బరువు 2.5 కేజీలు వచ్చేదాకా.

**—డా॥ కె. వెంకటేశ్వరరావు**





# ఓ సైకిలు కథ

కొండముది లలితాకల్యాణి

“ఓరేయ్! శ్రీపతి! నంటీ!” ఇంట్లో వంచి వచ్చిన అమ్మ పిలుపు వినగానే తన కొచ్చిన కలను మననం చేసుకుంటూ ‘ఏమిటమ్మా!” అంటూ ముందు గదిలో నుంచే అడిగాడు.

“ఏమంది కొంచెం ఇలా రా!” బిగ్గరగా పిలిచింది అరుంధతి. “వస్తున్నా! వస్తున్నా!” అంటూనే వివిధ భారతిలో మరో రెండు పాటలు విని తీరిగ్గా “ఏందుకూ!” అన్నాడు నెమ్మదిగా.

“సెంటరుదాకా వెళ్ళి కూరలు తెచ్చి పెట్టడానికి టైముందా నీకు?” అన్నది అరుంధతి కూరలు తేవాలని, అవసరమని ఆ ఒక్క మాటలో సూచిస్తూ! షికారుగా పగటిపూట నీరెండలో అలా అలా తిరిగిపోతూ సైకిలు తొక్కుతూ వెళ్ళడంలో మజా ఊహిస్తూ “వెళ్ళక తప్పదా?” అన్నాడు కూరల సంచి తీసుకుంటూ.

విలగరా! కూరలు లేకపోతే నాన్న అన్నం తినరు. పప్పు లేకపోతే అన్నయ్య అన్నానికి రాడు. ఇంక మీ అక్కంటావా, దానికి పెరుగు ఉండాలి. అందువల్లే మనకి విస్తట్లో నాలుగు రకాలూ ఉంటేనే కానీ ఆ భోజన కార్యక్రమం పూర్తికాదు.

“సరేలే! డబ్బులివ్వు” అంటూ తల్లి దగ్గర పచ్చకాగితం తీసుకుని రోడ్డెక్కాడు శ్రీపతి.

సైకిలు కొట్టు చలమయ్య అప్పుడే కొట్టు తెరిచి అలారం మోగిస్తూ, నోటు బుక్కు రెడీచేసి కస్టమర్స్ కోసం కొట్టు ముందున్న స్టూలు మీద బీడి తాగుతూ కూర్చోవడం దూరంనుంచీ వస్తున్న శ్రీపతి చూపును దాటిపోలేదు. రోజూ కనబడే ఆ కొట్టు, ఇవాళ ఎందుకు మరింత ఆకర్షణీయంగా ఉందా అని చూస్తున్న శ్రీపతికి తళ తళ లాడుతున్న రాజకుమారుడి ఠీవితో పాత సైకిళ్ల మధ్య వెలిగిపోతున్న క్రొత్త రాలీ సైకిలు కనపడింది.

“టైము ఎనిమిదీ పదిహేను వేసుకోండి!” అంటూ “క్రొత్త సైకిలు ఎక్కడ కొన్నారు!” అని ఉత్సాహంగా అడిగాడు శ్రీపతి.

మొన్ననే బెజవాడ వెళ్ళి, బండి కొన్నాను. ఆరువందలైంది అసలు ఆ కంపెనీ… ఆ మేనేజరు హోదా… ఆ మర్యాదా చలమయ్య తన్మయత్వంలో చెప్పుకుపోతుంటే ఆ కొత్త బండి తీసుకుని తూనీగలా వెళ్ళిపోయాడు శ్రీపతి.

ప్రశాంత వాతావరణం, కొత్త సైకిలు మీద ప్రయాణం చేసినట్లు తన కొచ్చిన కల నిజం కావడం, నిండుగా కనపడుతున్న కూరగాయల మార్కెట్టూ చవక బాబా అంటూ మార్కెట్టు మధ్యలో ఉన్న బేరర్లూ శ్రీపతిని వాస్తవంలోకి ఉత్సాహంగా తీసుకొచ్చాయి.

నిండుగా ఉన్న కూరగాయల సంచీ తీసుకుని సైకిలు స్టాండు మధ్య నుండీ కొత్త సైకిలు తీస్తున్న శ్రీపతికి ఇది నా స్వంతమైతే అనే భావం మెరుపులా మెరిసింది. అందువల్ల సాలోచనగా పరికించాడు శ్రీపతి. తన మిత్ర బృందంలో ఎవరికీ ఇలాంటి సైకిలు లేదు. రంగు నలుపని పేరే కానీ ఎంత ముద్దుగా ఉందీ సైకిలు! కుషను సీట్లూ, సంగీతం వినిపించే సైకిలు బెల్సూ, స్టీలు కెరేజి, సైకిలు మధ్య వేలాడుతున్న ప్లాస్టిక్ పూలూ ఇవన్నీ అదనపు ప్రత్యేకతలుగా కనపడ్డాయి శ్రీపతి కళ్లకు. మనోవేదిలో తాను కొనబోయే సైకిలు గురించి తీపి ఆలోచనలతో కొట్టుదాటి

వెళ్ళిపోతున్న శ్రీపతి బాబుగారూ! అనే చలమయ్య పిలుపుకి ఈ లోకంలోకి వచ్చాడు.

"ఎలా ఉందండీ సైకిలు?" ఆతృతతో అడిగాడు చలమయ్య.

"చాలా బావుందండీ! చాలా హాయిగా ఉంది వెళ్ళంటే..." శ్రీపతి చలమయ్యకి చెప్పి కూరల సంచీ చేతికి తీసుకుని ఇంటి కేసి వెళ్ళాడు.

ఎప్పటికన్నా తొందరగా వచ్చిన కొడుకు

చేతిలో కూరల సంచీ తీసుకుంటూ "ఈ పూటకి ఏం చెయ్యమంటావ్ ?" అన్నది అరుంధతి. మనసంతా ఎక్కివచ్చిన సైకిలు మీద ఉండడంతో బెండకాయలు అని చెప్ప బోయి దొండ కాయలు చెయ్యి అన్నాడు.

భోజనాలు చేస్తుంటే సైకిలు విషయం అందరికీ చెప్పవచ్చు అనుకుంటూ గబగబా సగం పూర్తిచేసి కంచం ముందుకొచ్చాడు శ్రీపతి.

"అన్నయ్యా! రాలీ మంచిదా? బి ఎస్ ఏ. మంచిదా?" అని అడిగాడు సైకిల ప్రస్తావన తెస్తూ.

"జాగ్రత్తగా వాడుకోవాలి కానీ ఏ కంపెనీ అయినా ఫరవాలేదు." అన్నాడు అగ్రజుడు. నా సైకిలకి ఒక ఓటు అనుకుంటూ "అక్కా! ప్రతి చిన్నా పెద్ద పనికి అద్దె సైకిలు తీసుకోవడం వేస్టు కదూ!" అన్నాడు.

"నాన్నగారు ఎలాగూ నీకు సైకిలు కొనిపెడతానన్నారుగా! నీ రిజల్ట్సువచ్చాక కొనుక్కో!" అన్నది అక్క. అక్కవోటు నాన్నగారి వోటు కూడా వచ్చాయ్ అనుకుంటూ "అమ్మా! సైకిలుంటే ఎప్పుడు పడితే అప్పుడు ఎక్కడికి పడితే అక్కడికి వెళ్ళచ్చు కదూ!" ఆశలన్నీ కళ్ళల్లో నింపుకుని అడిగాడు తల్లిని.

"సైకిళ్ళు, స్కూటర్లు అంటూ మీరు కానీ మా వాళ్ళల్లో ఎవ్వరూ ఎక్కడికి ఏదీ ఎక్కేవారు కాదు. సైకిళ్లంటూ ఉన్నాక ప్రమాదాలు అవీ..."అంటూ తన ఆశల మీద చన్నీళ్ళు చల్లే తల్లి వైపు ఎప్పుడూ, ఇంతే అన్నట్లు చూసి "ఉహూ!" అంటూ ఒకసారి మూలిగి వెళ్ళిపోయాడు.

సాయంత్రం ఆఫీసునుంచి హుషారుగా వచ్చిన రామారావు "పిల్లలేరీ!" అన్నాడు భార్యనుద్దేశించి.

"చిన్నాడు పార్కుకెళ్ళాడు. శ్రీపతి ఫ్రెండ్సు ఎవరో వస్తే అట్నా వెళ్ళాడు. ఆడపిల్లలు ఇద్దరూ సినిమాకి వెళ్ళారు" అంటూ పిల్లల వివరాలుచెప్పింది అరుంధతి.

చల్లగాలికి సేదదీరుతున్న భర్త దగ్గరికి కాఫీ కప్పుతో వచ్చిన అరుంధతితో,

"పిల్లలు పెరుగుతున్నారు కదూ!" అన్నాడు.

"ఆ! పిల్లలూ వాళ్ళతో పాటు వాళ్ళ కోరికలూ!" అన్నది అరుంధతి ప్రొద్దున్న కొడుకు అన్న మాటలు దృష్టిలో పెట్టుకుని.

"అలాంటివన్నీ సహజమే! అడగకుండానే సైకిలుకొని పెడతానని శ్రీతో అన్నానుకదా! అలా కొనిపెట్టడం వాళ్ళని ప్రోత్సహించినట్లుంటుంది" అన్నాడు రామారావు.

"ఇక మీ ఇష్టం. కొనేది మీరు కొనిపించుకునేది వాడు. మధ్యలో నేను..."

"ఎవర్నంటావే అంతేనా? బెటర్‌హాఫ్ అంటే"......

"మీ వివరణలు భోజనాల దగ్గరచెపుదురుగాని" అంటూ వంటింట్లోకి వెళ్ళింది అరుంధతి.

భోజనాల దగ్గర పిల్లలచేత ఊళ్ళో విశేషాలు చెప్పించు కున్నాక "పెద్దబాబూ! రేపు కాశీశం గారింటికి వెళ్ళి వాళ్ళ అబ్బాయి దగ్గర ఉన్న సైకిలు చూడండి! మీకునచ్చితేచూద్దాం!" అన్నాడు రామారావు.

"ఆ పాత డొక్కులు వద్దుబాబూ! రెండొందలు ఎక్కువైనా క్రొత్తదే సుఖం" ఏవీ తెలియని అక్క ఉవాచ.

"అదేమంత మరీపాతది కాదు. ఒక ఆర్నెల్ల క్రితమే వాళ్ళబ్బాయి కొన్నాడు" అన్నాడు పెదబాబు.

"ఎంత ఆర్నెల్లయినా పాతది పాతదే!" తన విముఖత చూపించాడు శ్రీపతి.

మర్నాడు ఏమనుకున్నాడో ఏమో! అన్నగారివెంట వెళ్ళాడు శ్రీపతి. 'ముదురాకు పచ్చరంగుతో, స్టీలు కేరేజీతో ఉన్న సైకిలు రెండొందలేట' అన్న అన్నగారిమాట వినగానే తెమ్మనుకున్నాడు, ఆ సైకిలుని ఇంటికి మౌనంగా.

'చిన్న చిన్న రిపేర్లు చేయించుకో!' అనే నాన్నగారి మాటతో చలమయ్య షాపుకి నడిపించి, బ్రేకులు సరిచేయించి, సంగీతం వినిపించే సైకిలు బెల్లు నింపుతుందో కనుక్కున్నాడు శ్రీపతి. నలభైరూపాయలు అన్న చలమయ్య మాటకి ఈ పాత మోహానికి అదొక్కటే తక్కువ అనుకుంటూ ఇంటికి వచ్చాడు శ్రీపతి.

నాలుగు రోజులు వాడేసరికి సెకండు హేండు సైకిలు నేను కొన్నది అనే భావం పోయి కనపడ్డ స్నేహితులందరికీ కొత్త గర్వంగానే చూపించాడు. కొత్తగా తెరిచిన కాలేజీ మోజుల్లో సైకిలు మోజు మరిచిపోయాడు శ్రీపతి. తనని నిర్లక్ష్యంగా చూస్తున్న శ్రీపతిమీద కోప మొచ్చినట్లుంది సైకిలుకి. కాలేజీకెళ్ళి వస్తుంటే గాలి పోయిన శబ్దానికి పంచరు పడ్డదో, చాలు ట్యూబు పోయిందో అర్థంకాక తికమక పడ్డాడు శ్రీపతి. ముందు చక్రం కదలక పోవడంతో ఆ సైకిలు భారాన్ని కూడా మోసుకుని సైకిల షాపు కెళ్ళాడు శ్రీపతి. తన పాకెట్ మనీ అంతా సైకిలు రిపేర్లకి ఇవ్వాల్సొచ్చేసరికి శ్రీపతికి ఉక్రోషం వచ్చేది, పాతది కొనేటప్పుడు ఒప్పుకున్న తన మీద, కొని పెట్టిన నాన్నగారి మీద. నిరుత్సాహంతో చాలాసార్లు "ఇదే అద్దెదైతే ఇలాంటి బాధలుండవు" అని అనుకున్నాడు. సైకి మాత్రం స్నేహితులముందు ముందు చూపు లేకుండా సైకిలుని పొగిడి వాళ్ళ భారం కూడా సైకిలుమీద మోయమన్నాడు.

"అరుంధతీ! శ్రీపతి సైకిలు నేను వేసుకెళ్ళనా?" తమాషాగా అడిగాడు రామారావు.

"ఇంకేం! ఆ కోరికాడా తీర్చుకోండి మరి" అంటూ భర్తను పంపిన అరుంధతి ఐదు నిమిషాల్లో వెనక్కొచ్చిన భర్తని ఏమిటన్నట్లు చూసింది. "ఇటూంటివి పిల్లలు తప్ప నా లాంటివాళ్ళు వాడలేరు" అంటూ తన బైక్ వేసుకుని వెళ్ళాడు రామారావు.

కాల చక్రం తిరుగున ఆరునెలలు గడిచే సరికి సైకిలు అలంకారపు సామాగ్రి పోగొట్టుకుని వగ్గు సుందరిలా గోడకి ఓ మూల ఒదిగింది

"ఆ రెండు చక్రాలూ ఇంకో రెండు రోజులు చూసి పాతిక్కో పెడతాను" విసుగుతో అనే అమ్మ మాటలకి చిన్న

ఋచ్చుకునేవాడు శ్రీపతి.

పిల్లల అజాగ్రత్త మీద అరగంట ఉపన్యాసం ఇచ్చి "ఇలా అయితే మళ్ళీ నీకు నేను సైకిలు కొనిపెట్టేది లేదు" అంటూ "ఈ సైకిలు మీద ఒక వందరూపాయలు

## ఓ సైకిలు కథ

వచ్చే మార్గం చూడండి! తరువాత మిగిలిన డబ్బు వేసి క్రొత్తది కొనుక్కుందువుగాని" అన్నారు రామారావుగారు.

అప్పుడే రాలీ సైకిలు ఎక్కినంత ఉత్సాహంగా "థాంక్యూ డాడీ! థాంక్యూ వెరీమచ్" అంటూ చలమయ్య కొట్టు కేసి నడిపించాడు ఆ పాత రెండు చక్రాలు మాత్రమే ఉన్న సైకిలుని శ్రీపతి.

# ఫాలాక్షుని డైరీ

**బాంబులను పట్టుకొచ్చిన దొంగచూపులు!**

సైదాబాద్ (?) ప్రాంతంలో సెప్టెంబరు 16వ తేదీ 30 ఏళ్ళ కమరాజాన్ అనే అమ్మాయి దొంగచూపులు చూసుకుంటూ ఓ సందులో వెళ్ళిపోతూ అదరిపోయే పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ను చూసి గిరుక్కున వెనక్కు తిరిగి పక్క సందులోకి వెళ్ళిపోయిందట. ఇది చూసిన ఆ ఇన్‌స్పెక్టరు ఆమెను వెంబడించి పట్టుకుని, ఆమె సంచిని సోదాచేస్తే అందులో ఓ పదినాటుబాంబులు, 34 వైర్లు, అగ్గిపెట్టెలూ వగైరాలున్నాయట.

**అమెరికాలో తాగుబోతు స్త్రీలు!**

అమెరికాలో ఏడు లక్షల మందికిపైగా ఆడవారికి తాగుడు మానలేనంత అలవాటుట. ఈ ఆడువారిలో అనేక వయస్సుల వారున్నారట. పెళ్ళికాని చిన్న పిల్లలు కూడా వున్నారట. ఈనాడు అమెరికాలో జరిగే వివాహరద్దులలో ఆడవారు తప్పతాగడం కూడా ఒక కారణమట.

**ఏడాదికి 40 లక్షల కార్లు!**

జర్మనీలో కార్ల ఉత్పత్తి రానురానూ పెరిగిపోతుందట. పోయినేడు నలభై లక్షల కార్లు ఆ దేశం తయారు చేసిందట.

**పెరిగిపోతున్న హత్యలు, దోపిడీలు!**

పశ్చిమబెంగాల్ ప్రభుత్వం తీసిన లెక్కల ప్రకారం 1976లో 741 హత్యలూ 831 దోపిడీలు జరిగాయట. అవి 1978 నాటికి 932 హత్యలుగానూ, 1203 దోపిడీలుగానూ అభివృద్ధి చెందినట్టు తేలిందట. ●

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# వారఫలం

## 19-10-1979 శుక్రవారం మొదలు 25-10-1979 గురువారం వరకు

**మేషం :** మేషరాశి వారికి ఈ వారం సుఖం, ఆనందం, ఆర్థికాభివృద్ధి బంధుమిత్ర సందర్శనం ఇత్యాది మంచి ఫలితాలను చెప్పవచ్చు. సభా గౌరవం. సాహిత్య గోష్ఠి కూడా సంభవం. వ్యాపారంలో ఉద్యోగంలో బాగుంటుంది. ఇతరులకు చెల్లించవలసిన బాకీలకు కూడా తీర్మానం కలిగేవారం. స్త్రీలకు :— ఆర్థికంగా కొంత ఒత్తిడి కలదు.

**వృషభం :** స్నేహితులను ఆదుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. సంఘసేవలో పేరు వస్తుంది. రాజకీయంగా చాలమందికి అనుకూలత లేదు. నూతన పదవులు చాలమందికి హోదాగల పదవులు లభించే అవకాశం లేదు. ఆర్థిక స్తోమతుకు ఏవిధంగా లోటురాదు. స్త్రీలకు :— ఆత్మీయులతో గోష్ఠి, గృహానందం, ఆదాయం చెప్పవచ్చు.

**మిథునం :** రాశ్యాధిపతి అనుకూలుడు. కళా రంగంలోని వారికి ప్రగతి చెప్పవచ్చు. పత్రిక గ్రంథ ప్రచురణ, రచయితలకు చాలా విధాల యోగ్యమైన వారం. అనుకున్న ముఖ్య కార్యాచరణ కొనసాగుతుంది. గురు శుక్రవారాలలో ప్రయత్నించిన కార్యానుకూలతకు లోపంరాదు. స్త్రీలకు :— అన్ని సౌఖ్యములకు లోటు రాదు. ఆర్థిక స్తోమతు సమకూడే వారం.

**కర్కాటకం :** క్రీడారంగానుభవం గల వారికి, పత్రిక రచనావ్యాసంగంలోని వారికి చలనచిత్ర రంగానుభవం గలవారికి, క్రయ విక్రేతలకు శుభప్రదమైన వారం. తీవ్రంగా కృషి చేయండి, మనోవాంఛా ఫలసిద్ధి కల్గుతుంది. వారఫలం ఉత్తమోత్తమమని గ్రహించ గల్గుతారు. స్త్రీలకు : బంధువర్గం వారివల్ల చిక్కులుండవచ్చు. ఆర్థికంగా కూడా లోపం కనిపించవచ్చు.

**సింహం :** వ్యాపార రంగంలోని వారికి వారారంభము నుండి అభివృద్ధి కనిపిస్తుంది. కుటుంబసభ్యులతో వాదాలు రాకుండా చూచుకోవాలి. వాద ప్రతివాదాలకు, చోటువిచ్చే గ్రహస్థితి గలదు. ఆరోగ్యాన్ని గూర్చి మరొకమారు హెచ్చరిక! తీవ్రంగా ఇబ్బంది పడుతారేమో! ఆర్థికంగా జాగరూకత అవసరం. కృషికి తగిన ఫలితం గలదు. ఆదివారం ప్రయత్నించిన కార్యం అనుకూలం. స్త్రీలకు :— ఒక ఉత్తమమైన వారంగా ఉంటుంది. వ్యయ సూచనగల వారం.

**కన్య :** చిత్తా నక్షత్ర జాతులకు అప్రయత్నంగా ఆశ్చర్యకరంగా లాభం ఆదాయం సమకూడే వారం. ఏదో ఒకవిధంగా చేతికి ద్రవ్యం అందటం గృహానందం పొందటం విందు వినోదాలలో పాల్గొనటం ఈ వార ముఖ్యలక్షణం. స్త్రీలకు :— గృహభారంతో విందు వినోదాలతో స్వల్పాదాయంతో వారం గడుస్తుంది. ఆరోగ్యలోపం లేదు.

**తుల :** వార ప్రథమ భాగంలో ఖర్చులు అధికంగా తగులుట గమనిస్తారు. అందుకు తగినట్లున్నా చాలాకాలంగా ఇతరుల చేతిలో నిలిచిన ద్రవ్యం కొంత వరకైనా అందటం జరుగుతుంది. రాజకీయవాదులకు సంఘసేవకులకు నూతనావకాశాలుంటాయి. గౌరవం భిన్నమార్గాలలో అభివృద్ధి చెందుతుంది. స్త్రీలకు : సంఘగౌరవం అభివృద్ధి ఉద్యోగానుకూలతగల దినం గురువారమని గ్రహించండి.

**వృశ్చికం :** బాకీలు వసూలయ్యే వారం. కృషి రాణించే వారం. ముఖ్య కార్యాచరణకు యోగ్యమున్న వారం. వార మధ్యభాగంలో ద్రవ్యాదాయం సంభవం. అనుకూలమైన వారంగా శుభ కార్యానుకూలత గల వారంగా గుర్తించండి. చేసే పనిలో స్వల్ప లోపం కనిపిస్తుంది. వారాంతానికి సర్దుబాటు లభిస్తుంది. స్త్రీలకు :— ఇచ్చిపుచ్చుకోవటంలో ఇబ్బందులు రావచ్చు. రచయిత్రులకు మేలైన వారంగా గ్రహించాలి.

**ధనుస్సు :** వారారంభం వ్యయమధికం. అయినా వ్యాపారోద్యోగాలలో పెద్దగా ఏవి చిక్కులు రావు. అవసరాలకు సరిపోయే ఆదాయం సంభవం. సంఘసేవలో బంధువర్గానికి సహాయం చేయడంలో ప్రశంస పొందగలుగుతుంది. వార ద్వితీయ భాగం అన్నివిధాలా లాభదాయకం. అనేక క్రొత్త విషయాలు తెలుసుకుంటారు. అన్నింటికి దూరంగా ఉండటం శ్రేయం. స్త్రీలకు :— ముఖ్యముగా ప్రభుత్వోద్యోగాలలో ఉన్నవారికి అభివృద్ధి గలదు.

**మకరం :** ఇంకా ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించుట అవసరం. అనవసర విషయాలలో జోక్యం చేసుకోరాదు. వస్తువులు, ధనం స్వంతంగా పోగొట్టుకునే అవకాశమున్నది. కాబట్టి జాగ్రత్తగా ఉండటం అవసరం. రాశికి ఉచ్ఛస్థగ్రహ కారణంవల్ల, మానసికంగా చిక్కులు కలిగినట్లనే ఉంటుంది. బాగా శ్రమించితే గాని కనీసం జరుగవలసిన పనులు కూడా జరుగవు. స్త్రీలకు :— దైవకార్యాలు, పుణ్యకార్యాలు, వ్రతాదులు, నిర్విఘ్నంగా నెరవేరుతాయి.

**కుంభం :** ఉత్సాహ ఫలితం ఆశించవచ్చు. ఆర్థిక రంగంలో జాగరూకత వహించవచ్చు. ఎంతగా శ్రమిస్తే అంత లాభదాయకం. శారీరక, మానసిక వ్యథ ఉండనే ఉంటుంది. గురు, శుక్రవారాలు మీ కృషికి తగిన ఫలితం లభ్యం. విజ్ఞాన ప్రదాయక విషయాలలో లాభదాయకం. స్త్రీలకు :— యోగం, ఆదాయం, ఆనందం సమకూడే వారం.

**మీనం :** సప్తమ స్థానంలో గల గ్రహాలు, మీ రాశికి శుభదాయకంగా ఉపయోగపడటంలో, లోపంలేదు. వార ద్వితీయ భాగం సుఖంగా, ద్రవ్యాదాయంతో, మీకు ఆనందం కలిగిస్తుంది. సర్వతోముఖాభివృద్ధి గల వారం వారఫలం మీకు యోగదాయకం. స్త్రీలకు :— బంధువర్గీయుల వలన సహాయసంపత్తులు సమకూడుతవి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## ధర్మపథం

# హనుమంతుని ఉపాయం

శ్రీరామునికి పట్టాభిషేకం అయిన తర్వాత అతని సోదరులూ, సీతాదేవి ఆయన సేవలోనే నిమగ్నులు కావడానికి నిశ్చయించుకుని, అంతవరకూ సేవచేసిన హనుమకు కొంత విశ్రాంతి యివ్వాలని అనుకుని ఆ సంగతిని హనుమంతునికి చెప్పారు. అతనికి రామసేవయే పరమార్థం. అది తప్పిపోతున్నందుకు మనస్సులో చాలా బాధపడ్డాడు. కాని, తన కంటే ముఖ్యులైనవారు దానికి సిద్ధపడగా—అది కూడదని తాను ఎలా అనగలడు? అందువల్ల మారు మాటాడక ఆలోచనలో పడ్డాడు.

శ్రీరాముడు నిద్రలేచిన దగ్గరనుంచి రాత్రి నిద్రపోయేదాకా ఆయనకు ఎవ్వరెవ్వరు ఏయేవిధంగా సేవ చెయ్యాలో నిర్ణయించుకొని ఆ సేవలను ఒక పట్టికగా తయారు చేసుకుని, ఆ పట్టికను ఆయనకు చూపించారు. శ్రీరాముడు దానిని చూచి, చిరునవ్వు నవ్వుతూ తాను మౌనంగా ఉన్నాడు. తర్వాత అతని సోదరులు ఆ పట్టికను హనుమంతునికి వినిపించారు. అది విన్న తర్వాత అతనికి చటుక్కున ఒక ఆలోచన తోచింది. "సరే! మీరు మిక్కిలి జాగ్రత్తగా సేవలనన్నిటినీ గుర్తించారు కాని, ఒక్క చిన్న సేవను మాత్రం విడిచి పెట్టారు. ఆ సేవ చెయ్యడానికి నాకు అనుమతి యిస్తే చాలు" అన్నాడు దానికి వారు సమ్మతించారు. శ్రీరాముడున్నూ ఒప్పుకన్నాడు.

హనుమ ఇలా అన్నాడు—"వ్యక్తి ఆవలించి నప్పుడు చిటికె వెయ్యడం పరిపాటి. శ్రీరాముడు చక్రవర్తి కనుక, ఆయన ఆవలిస్తే ఆయనయే చిటికె వెయ్యటం ధర్మం కాదు. మరొకరు చెయ్యవలసిన పని అది. ఆ అత్యల్పమైన సేవను నేను చేస్తాను" అని.

మనిషికి ఆవలింత ఎప్పుడు వస్తుందో ఎవ్వరికి తెలుసు? ఆ సమయాన్ని కని పెట్టుకొని చిటికె వెయ్యాలంటే ఎప్పుడూ ఆయన దగ్గర ఉండవలసిందేకదా! లక్ష్మణుడు మొదలైన సోదరులు, సీతాదేవి వారి వారి విహిత సేవలను చేసి వెళ్ళి పోతారు. ఎల్లప్పుడూ శ్రీరాముని దగ్గర ఉండరు. కాని హనుమంతుడు మాత్రం సదా ఆయన దగ్గర ఉండవలసిందే కదా! దీనినే ఆలోచించి, హనుమ తనకు సదా రామసేవ లభించడానికి చక్కని ఉపాయం పన్నాడు. తన ప్రభువును క్షణమైనా విడిచి ఉండడానికి అతనికి ఇష్టం లేదు. అతని ఉపాయంవల్ల అతని కోరిక నెరవేరింది.

దీనిని గ్రహించే శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు.

హనుమంతునికి శ్రీరాముని యందుండే ప్రగాఢ భక్తి దీని వల్ల స్పష్టంగా తెలుస్తున్నది.

—బులుసు వేంకట రమణయ్య






Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ. నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి. పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.




LT/CAS-I/77R TEL

## సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ

# చూపుకి అందం కంటికి చలవ

# అదే ఐటెక్స్ కాటుక



స్థానికమైన ఉత్తమ తైలముల మూలికల మిశ్రమంతో శాస్త్రరీత్యా తయారైనది ఐటెక్స్.




పెట్రోలియమ్ జెల్లీగాని, మైనంగాని, ఏ విధమైన రంగుగాని చేర్చబడనిది ఐటెక్స్.

కళ్ళకు కాంతి, చలవ ఆకర్షణలను కల్పించుటలో సాటిలేనిది ఐటెక్స్.

35 ఏళ్లుగా మీ అపార విశ్వాసమునకు ఒక చిహ్నము ఐటెక్స్.

మీ సౌందర్యమునకు మీ కన్నులే జీవనాడి. దానికి సాటిలేని ఉత్తమమైన కాటుకనే వాడాలి. అదే ఐటెక్స్ కాటుక అని వేరే చెప్పాలా?

ARAVIND LABORATORIES MADRAS-600 033